# బ్రహ్మన్న విజయము

[ చరిత్రాత్మక నవల ]

ఉభయభాషాప్రవీణ, వేదాంతశిరోమణి
లంకా సీతారామశాస్త్రి

విద్వాన్, భాగవతుల వేంకటసుబ్బారావు
ఆంధ్రోపాధ్యాయులు



స్వతంత్ర భారతీ ప్రచురణములు
నరసరావుపేట

# బ్రహ్మన్న విజయము

చరిత్రాత్మక నవల




ఉభయభాషాప్రవీణ, వేదాంతశిరోమణి

లంకా సీతారామశాస్త్రి

విద్వాన్, భాగవతుల వేంకట సుబ్బారావు

ఆంధ్రోపాధ్యాయులు

పురపాలకోన్నత పాఠశాల నర్సరావుపేట





స్వతంత్రభారతీ ప్రచురణములు

నరసరావుపేట : గుంటూరుజిల్లా





1948

మూల్యం 1–2–0

# పరిచయము

చరిత్ర ప్రసిద్ధులైన తెనుగు వీరులలో పల్నాటివీరులు సుప్రసిద్ధులు. వారిచరిత్ర యెవరెన్నివిధముల వ్రాసినను సరసముగనే యుండును. పల్నాటి వీరుల శౌర్యరసాత్మకమైన కథను తీసికొని నవలారూపమున వ్రాసినదీ బ్రహ్మన్నవిజయము. దీనిని వ్రాసినవారు మా పాఠశాలయందలి ఆంధ్ర పండితులిరువురు. ఒకరు 'ఉభయభాషా ప్రవీణులు' ఇంకొకరు 'విద్వాన్' కావున ఈ పుస్తకమందలి భాషాప్రాశస్త్యమునుగురించి నేనువేరుగా చెప్ప నక్కరలేదు. విశేషించి వీరిరువురును కవులు. వీరి కథాకథనప్రవాహము పటే సాగిపోవుచు ఆద్యంతమును రసస్ఫోరకముగానున్నది. శ్రీనాథుని ద్విపద కావ్యమునుండియు వీరభద్రకవి పద్యకావ్యమునుండియు కథకు ఆయువు పట్టైనచోట్ల రసగుళికలైన పద్యముల నుదాహరించి రచయితలు పుస్తకమునకు సొబగుతెచ్చినారు.

తెలుగు ప్రథమభాగమైన యీకాలమున నిట్టి జిగిబిగిగల గ్రంథములు విద్యార్థులు పఠింపవలసిన అవసరమెంతేనిగలదు. రచయితలిట్టి గ్రంథముల నింకను వ్రాసి విద్యార్థి లోకమునకును ఆంధ్రసరస్వతికిని ఇతోధికసేవ చేయుదురని ఆశించుచున్నాను.

మ్యునిసిపల్ హైస్కూలు
నరసరావుపేట

నాయని సుబ్బారావు
ప్రధానోపాధ్యాయులు

# బ్రహ్మన్న విజయము

## ౧

అది వసంతఋతువు. కోయిలకలుకులు వసంతరాజును గీర్తించు వందిమాగధ గీతములవలె శ్రవణమధురములై యొప్పారు చుండెను. ఒకచో మహీరుహంబులు పొరుగాకుల రాల్చి దరిద్రదేవతారాధకు లట్లగపడు చుండెను. ఒక్క యెడఁ గొమ్మల నెఱ్ఱని చివురు జొంపముల నేత్రపర్వ మొనరించుచు ధనికాగారముల చందమున నందముగా నుండెను. ఒక్కనాటి ప్రభాతసమయమునఁ బ్రాచీదిగంగానాముఖ తిలకము పోల్కి బాలభానుఁ డుదయగిరి నధివసించుచుండెను. అమరావతీ పట్టణమున కమరేశ్వరుఁడు స్వాయముఁ గల్పించి యగత్తనాఁ గృష్ణానది ఒప్పారు చుండెను. అందలి శీకరాసారములచే మలయపవనుఁ డీశు నారాధించు విధముగ నుత్తుంగ తరంగములఁ జెలరేగు చుండెను

అట్టి తటిఁ బర్వదినమనియో, నిత్యవిధి యనియో కాని పెక్కురు ద్విజులొక్కట నఘమర్షణస్నానంబుల సావిత్రిని జపించు చుండిరి. ఒక్కచో నిగూఢతరంగములఁ గలిగి మకరముల కాకరమగు లెంకిమడుగులు సజ్జనహృదయముల పోలిక నచంచలములై యుండెను. అందలి అమలోదకంబులఁ బ్రతిఫలించు బాలసూర్యుని కిరణంబులు కాచి వడియఁ బోసిన పసిడి తీవెలునాఁ జూపరులకుఁ గనులపండువుగ నుండెను.

ఆజానుబాహువును, కోరమీసమును గలిగి క్షాత్రముట్టిపడు ముఖకాంతిచేఁ బ్రకాశించు దివ్యపురుషుఁ డొకఁడు భల్లాతకీ తైలార్ద్రవస్త్రముల ధరించి, కృష్ణాతరంగిణీ పవిత్రతోయములఁ గ్రుంకులిడుచుండెను. ఆ దివ్యమూర్తి మునుమున్నె మునిఁగి లేచెనో లేదో తా ధరించిన వస్త్రము లతిధవళము లయ్యెను. తన వెంటవచ్చు పరివారమంతయు విస్మయచిత్తులైరి. "ఔరా! ఈతఁడెన్ని పవిత్రతోయములఁ గ్రుంకు లిడలేదు? గంగానదిలోని మునుక లేమయ్యె? బదరికా వనము, కేదారము, మహాకాళము, వారణాశి, చిత్రకూటము మొదలగునవి పుణ్యక్షేత్రములని ప్రసిద్ధికెక్కినవే కదా? అందుఁ బోని దోషమిందు క్షణములో నశించుట క్షేత్రమాహాత్మ్యమై యుండనోపును!" అని కొందఱు తలంచిరి. మఱికొందఱు "రాజచరిత్ర నెఱింగినవారు కార్తవీర్యసమార్జితాఘము నా మహాత్మునితో సమసెను; చంద్రవంశమతిపవిత్రమయ్యె నని గుసగుసలాడిరి. ఇంకఁ గొందఱు తెలుఁగుసీమ కీతఁడే గుండెకాయ" అని తలపోసిరి. ఏది ఎట్లున్న నాతని రూప రేఖావిలాసాదుల గమనింప మహావీరుఁడనక తప్పదు. వేయేల? మంత్రివరుఁడు దొడ్డనాయని బాహుబలముచేతనే యీ అలుగు రాజు పరాక్రమము వెలయుచున్నదనుటలో సందేహములేదు.

స్నానానంతరము మహారాజు దానధర్మముల నర్థులఁ దనిపి తన యిష్టదైవమగు శ్రీ చెన్నకేశ్వర ప్రతిమ నర్చించి మంత్రి కనుసన్నతోఁ బరివారమెల్ల వెంటరా నమరేశుని గూడఁ బూజించి తమ విడిది చేరిరి. అమరావతిలోని ప్రజ

లంద అలుగురాజు కీర్తిని నానాటికిఁ బలుముఖముల వెల యించుచుండిరి.

ఇట్లుండ నొక్కనాఁడా రాజసచివుని నల్వురు పుత్రులలో బ్రహ్మనాయఁడును, పేర్నీఁడును సముద్రస్నానమునకు వెళ్లిరి. వారి యొద్ద కొక బ్రాహ్మణోత్తముఁడు వచ్చి ఆశ్రయించెను. ఆతని ముఖము దుర్గంధము మాత్ర ముండెను. అది చూచి వారిట్లనిరి.

ఆర్యా! తాము విప్రులయ్యు నక్షతలేల ధరింపరైతిరి?

బ్రాహ్మ:— అయ్యా! మా చరిత్ర యొక యిసుక పాతర వంటిది.

బ్రహ్మ:— అది మేము వినఁదగినది కాదు గదా?

బ్రాహ్మ:— లేదు; స్వామీ!

బ్రహ్మ:— అట్లయిన సంగ్రహముగాఁ దెల్పఁ బ్రార్థించుచున్నాము.

మహాత్మా! "మాది చందవ్రోలు పురము. ఆ పట్టణాధినేతృ గృహద్వారమునఁ బెంపుడుపిచ్చుకలనేకము లున్నవి. అక్షతధారులగు విప్రు లగుపడిన తోడనే మాస్టీలు (శస్త్రవిద్యానిపుణులు) వానినిఁ బైకెగఁ గొల్పుదురు. అవి వచ్చి వారి ముఖాక్షతలను ముక్కునఁ బొడిచి తినిపోవును. ఆగాయములు లేని విప్రుఁడే లేఁ" డని తన మోమును జూపి అవనతవదనుఁ డాయెను.

పేర్మి:— స్వామీ! అది మీరాజు చెవినిఁ బడలేదా?

బ్రాహ్మ:— పడినది; ప్రత్యక్షముగా మాగోడు ననేకరీతుల విన్నవించు కొంటిమి. అయిన నేమి? వృథ యయ్యెను. అది మొదలుగా నక్షత ధారణ మానితిమి. అని దైన్యమొలుక నిలిచెను. అంత నామంత్రి పుత్త్రిలు బ్రాహ్మణునకు వలయు ధన మిచ్చి పంపిరి. వారి యీవినిఁ జూచి చందవ్రోలు పురవాసియగు భట్రా జొక్కఁ డందుండి యిట్లనియె.

మహాత్ములారా! మారాజొనర్చు దానములలో నిది యేపాటిది? ఒక్క దానగుణముననే కాదు. పరాక్రమమునఁ గూడ నధికుఁడు.

బ్రహ్మ:— భట్టూ! నీ పేరును సార్థకముఁ జేసికొంటివే!

భట్టు:— ఎందులకని?

పేర్మి:— విప్రుని మొఱాలింపని ప్రభువు పరాక్రమోపేతుఁ డని నీవు పొగడినందులకు —

భట్టు:— ప్రభూ! పొగడుట గాదు. ఉన్న దున్నట్లుగఁ జెప్పితిని.

బ్రహ్మ:— అయినచో నీ అయఃఖనిత్రము నిదే నీమెడలో గ్రివేయక మొనర్చుచుంటిని. దీనిని మీరాజుచే నూడదీయించుకొని రమ్ము; పిదప నీరాజును నుగ్గడించుము; వలసినంత ధన మిచ్చెదము. అప్పుడే ఆతనిని పురుషునిగ నెంతుము.

భట్టు:— ఒకవేళ నట్లు గానిచో ?

పేర్నీ:— నీవును నీ రాజును మా దొరయగు అలుగురాజు నే పౌరుషవంతుఁడగు ప్రభువుగఁ బాటింప వలయును. చెప్పెడి దేమి ?

అంతట నా భట్టు చందవ్రోలు రాజుకడ కేగి జరిగిన దెల్లఁ జెప్పి మెడలోని యినుప గుదియమును జూపెను. అది చూచి ధవళశంఖుఁ డచ్చెరువొంది " ఇది మానవమాత్రునికి సాధ్యమైనది కాదు. ఎవరిచే నిది చుట్టఁబడెనో వా రిద్దానిని విడిపించిన వారి ప్రభువే పౌరుషవంతుఁడని మే మంగీకరింతుము. వారి కడకే పొమ్ము " అనెను. దానికి భట్టు విస్మయమంది బ్రహ్మనాయనిఁ జేరి తన మొడయని యసమర్థతను వెలిబుచ్చెను. అంతట నాయఁ డా గ్రైవేయకము నొక్క చిటుకలో బుజు వ్రేవర్చెను. భట్టు దాని కరుసమంది వినుతింప సాగెను. నాయఁడును " ఓయీ ! భట్టూ ! ప్రభువు లెల్లరు సమానులే. హెచ్చు తగ్గులుగ ప్రభువుల నుగ్గడింప రాదు " అని మందలించి పంపెను.

పిమ్మట బ్రహ్మన్నయు, పేర్నీఁడును బ్రాహ్మణ వేషధారులై గంధాక్షతల మోమున ధరించి చందవ్రోలున కేగిరి. ఎప్పటి యట్లచ్చటి మష్టీ లూరబిచ్చుకలను వారిపై కెగఁగొల్పిరి. పేర్నీఁడు వాని నన్నిటిని సమయించెను. అంతట నా మాష్టీలు రోషించి వారిపైఁ గవియఁ జొచ్చిరి. తేని యాజ్ఞ లేనిదే దూతలఁ జంపుట పాడిగాదని వారినెల్లఁ ద్రోసి

పుచ్చి యిరువురును రాజును దర్శించి జరిగిన సంగతిని విన్న వించిరి. దానికి రాజూరకుండెను. వెంటనే బ్రహ్మన్న 'రాజా! తాము మాన మూనఁ జనము. అంగీకరింతురేని పణ మొకటి నిర్ణయింపుఁ డనెను. అంత నా రాజు మీరు గెలుపొందిన నా కుమార్తెను మీ రాజున కిచ్చి వివాహము గావింతును. మేము గెల్పొందిన మీ రాకొమరితను నాకిచ్చి పరిణయ మొనర్పవలయును. సరియేనా?' అని పల్కెను. వారు నందులకు సమ్మతించిరి. బ్రహ్మనాయని ఆజ్ఞఁ గైకొని పేర్నీఁడు శత్రువులపై దాడి వెడలెను. అందు పేర్నిదే పై చేయి అయ్యెను.

రాజు ధవళశంఖుఁడు కలుపించి మఱికొంత సేనను పేర్నిపైఁ బోరనంపి రాజద్వారముల మూయించి వింతఁ జూచు చుండెను. తేని అండఁ జూచుకొని సేనలు పౌరుష ముతో బ్రహ్మనాయనిఁ గూడ నాహ్వానించిరి. అతఁడు వికటాట్టహాస మొనరించి 'మిమ్ము నోడింప నే రావలయునా? మా సోదరుఁ డొక్కఁడు జాలు' నని ఉల్లసమాడెను. పేర్నీఁడును వీరవిహారుఁడై కదనభూమి నెల్లఁ గంగారొనర్చి సైన్య హతము జేసి 'ఓరీ! ఇంకెవ్వరైన గలరా? ఉన్న రండు. ఏమనుకొంటిరో పేర్నీఁడన్నఁ బక్కలో బల్లెము సుమా!' అని విజృంభించెను. ధవళశంఖుఁ డంతట వారి పరాక్రమంబు నకు విభ్రాంతినొంది ప్రతిజ్ఞా ప్రకార మెల్లర సమ్ముఖముసఁ దన కూఁతురగు మైలమాదేవిని అలుఁగురాజున కిచ్చి వివాహ

మతివైభవముగఁ జేసి యల్లునకు పలనాటిసీమ నరణముగా నిచ్చెను.

పరిణయానంతరమున అలుఁగురాజు చందవ్రోలునఁగల శ్రీలింగోద్భవ స్వామిని సేవించి అర్చనోత్సవాముల నీశ్వరునిఁ దనిపి అమరావతీనగరమున కేగి మైలమాదేవితో సుఖ ముండెను.

అలుఁగుభూపతి చందవ్రోలున నుత్సవములు గావించు నెడ నొక్కచో మంత్రులును, ఒక్కయెడ సామంతులును, పురోభాగమునఁ బురోహితులును, పశ్చాద్భాగమున పరివార మును సేవించు చుండిరి. బహిర్ద్వారమునఁ బేర్నిఁడు గాపుం డెను. చూపఱుల డెందములెల్ల నాతని కోరమీసములపై నను, దీర్ఘబాహువులపైనను, దుర్నిరీక్ష్య ముఖకాంతిపైనను నిలిచి యుండెను.

ఆహా! ఏమి యీ ముఖసౌందర్యము! వీరపురుషోచిత లక్షణము లన్నియు నీతనిలో మొలకెత్తినవా? అన్నట్టు లా యాజాను బాహువులు, ఆకర్ణాంత నేత్రములు, ఆ బెడఁగు మీసములు చూచు వారెల్ల అను మన్మథభ్రాంతిఁ గలిగించు చుండెను. ఆ దివ్యసుందరుఁడు వెండిబెత్తమును ధరించి, జరీ తలపాగఁ జుట్టి యీశ్వరాలయ బహిర్ద్వారమున రాజభక్తి తత్పరతఁ గాపుండెను. పురోభాగమున దేవవేశ్యలనైన దుద్దు పెట్టు వారకాంతల నాట్యము నోరచూపునైనఁ జూడక తన యొడయఁ డీశ్వరారాధనను ముగించి మంత్రి సామంత పురో

హితులతో వెలుపలి కెప్పుడు వచ్చునో యని నిరీక్షించు చుండెను. చందవ్రోలునఁ గల జనులందఱు బక్కఁ జిక్కిన శరీరమును జూచి మంత్రి దొడ్డనాయని పుత్త్రుఁడా? అనియు, దబ్బపండు వంటి దేహకాంతినిఁ గాంచి బ్రహ్మనాయని యనుజుఁడా? అనియు, మోముపై నుప్పారు క్షాత్రమును జూచి ధవళశంఖుని గెల్చిన జగజెట్టి పేర్నిఁడీతఁడే యని నిశ్చ యించుచుండిరి. ఆ సద్గుకళావంతులలోని పాపసాని చెవినిఁ బడెను. అభినయ మెందుఁ బోయెనోకాని ఆమె చూపంతయు బేర్నిపైఁ బడి స్తబ్ధురా లయ్యెను. అంతలో రాజు పరివార సమేతముగా బయటికి వచ్చెను; వచ్చుటయే తడవుగాఁ బాజును సరిదీర్చి ఇరుఁగెలంకుల బరాబరులు సేయుచు పేర్నిఁడు ప్రభువు ననుసరించి కొల్చుచుండెను. ఒడయఁడాతని ప్రభుభక్తి కచ్చెరువొంది ధవళశంఖుని గెల్చి చేకొన్న యా చందవ్రోలు పురమున కధినేతగ నియమించెను. పేర్నిఁడును మహాప్రసాద మని తేని యానతి నౌదలఁ దాల్చి నిజశిబిర మున కరిగెను. అల్లురాజానాఁడు మాత్రము మామగారింటనే యుండి మఱునాఁ డమరావతి కేగెను — ఆ నిశీథమునఁ బాపసాని యొంటిగాఁ బేర్నినిఁజేరి వరించెను. ఆతఁడును "ఉపేతాం కామినీం త్యక్త్వా కాలసూత్రం వ్రజేన్నరః" అను నార్యోక్తిరీతి నా యాటవెలఁది వాంఛనంగీకరించి చందవ్రోలు పురముననే వసించుచుండెను. ఆ గణికయుఁ గొంతకాలము నకుఁ బేర్నితో 'నాథా! నా సర్వస్వమును నీ కర్పించెదను; దయతో నన్నుఁ బరిణయమాడఁ బ్రార్థింతు' ననియెను.

ఆతఁ డందుల కంగీకరింపక “తరుణీ! నిన్నుఁ బరిణయమగుట కులధర్మము గాదు. ఆ కోరిక నీవును గోరదగినది కాదు; మానుము; నిన్ను మాత్రము మఱువ” నని ఆ వారకాంత నొడఁబఱచి తన ప్రభువుతో నమరావతి కేగక అందే నిలిచి యుండెను.



౨

అమరావతి సిరుల కాటపట్టు. పుణ్యముల కిక్క. భోగ భాగ్యములకుఁ బెట్టినదిపేరు. కళలకు పుట్టినిల్లు. ధర్మములకు నిలయము. తెలుఁగు రాజుల ప్రధాన రాజధాని. ఎట్టిదైన నేమి? తత్పట్టణాధినేతకు మాత్ర మది అనపత్యతాదోషమును దొలఁగింప దయ్యెను. మువ్వురు భార్యలలో నొక్కరితకైనను సంతానము గలుఁగకూడదా? పాపమేపాపముఁ జేసెనో కాని ఆలుఁగురాజు సంతతి కాపోవుచుండెను. ఈశ్వరారాధన లొనరించుచుండెను. ఎప్పుడైనను ఫలమునకుఁ గాలము సమీపింప వలయునుగదా? సంతానము లేమికిఁ గుందుచుఁ దన మంత్రి గ్గైన రేచర్ల దొడ్డనాయని పుత్త్రులలోఁ బెద్దవాఁడగు పెద్దన్నను ప్రేమాతిశయముగఁ బెంచుకొను చుండెను. పుత్త్రవ్యామోహ మేమియో గాని కులభేదమునేని బాటింపదయ్యెను. తన పుత్త్రునకు స్వీయ క్షత్రియకన్య జేకొనియే వివాహముఁ జేయవలె నని పట్టుఁ

బట్టెను. తుదకు మాయోపాయములచేఁ గృష్ణగంధర్వుని కుమార్తె యగు ముక్తాలవాంబను బరిణయ మొనర్చెను. కన్యాదాత కంచెర్ల పట్టణాధీశ్వరుఁడు, భాస్కరాన్వయ శిఖామణి; తా నుత్తమ క్షత్రియునకుఁ బుత్త్రిక నిచ్చితి నని లోలోన నుబుకుచుండెను.

పెద్దన్న మిక్కిలి శౌర్యవంతుఁడు. అశ్వశిక్షణమున నాతని జెప్పి మఱొక్కరిం జెప్పవలెను. ఎట్టితురంగమునేని క్షణములోఁ స్వాధీన మొనర్చుకొనును. అశ్వహృదయవేది కది సహజమే కదా! ఈతనినిఁ గూర్చి మామ కృష్ణ గంధర్వుఁడు సభలో నప్పుడప్పుడు —

" బుద్ధులకుఁ బెద్ద పటుబలంబునకుఁ బెద్ద
లలిత సౌందర్యమునఁ బెద్ద కలనఁ బెద్ద
సాములను బెద్ద మేటి రచ్చలను బెద్ద
పేరు మాత్రమె కాదు తాఁ బెద్దరాజు."

అని మురిసిపోవుచుఁ బలుకుచుండెను. కొన్నాళ్లు కుమార్తెతోఁ గూడ నల్లునిఁ దనయింట నుంచుకొనెను. పెద్దన్నయు నంతరంగ వైభవములతో సూర్యోదయాస్తమయముల నెఱుఁగక విషయలోలుఁడై ముక్తాలవాంబతో మూఁడు పూవు లాఱు కాయ లన్నట్లు కాలముఁ గడుపుచుండెను. తోడి యల్లుండ్రతోఁ బాటుగ రథాశ్వారోహణము లందు గాని శస్త్రాస్త్ర విద్యలందుగాని బాల్గొనక గృహమందె ప్పుడును ధర్మపత్నితోఁ గలిసిమెలసి యుండుటఁ జూచి యెల్ల రీతనిని నప్రయోజకునిగ నెంచసాగిరి. అంతియగాక—

" వస్త్ర మాల్యాభరణ ముఖ్య వస్తువులకు
నన్న పానాదులకును బెద్దన్న పెద్ద
ముసల ముద్గర కుంత కార్ముక ముఖాఖి
లాయుధమ్ములఁ బెనఁగఁ జిన్నల్లుఁ డతఁడు. "

అని యాక్షేపణలు గూడఁ జేయసాగిరి. ఆతఁడా మాటను విని సమయమును గనిపెట్టి ఒక్కపెట్టునఁ దన పౌరుషము వారికిఁ జూపఁ దలఁచి ఒక్కనాఁటి రేయి నుక్కుతోఁ దయారుగావింపఁబడిన ఆయుధాగార కవాటము నొక్క కాలి తాపునకుఁ బగులఁ గొట్టెను. ఆ పిడుగుదెబ్బ కెల్లర గుండె లవిసిపోయెను. నాఁడు మొద లింటనేని రచ్చనేనిఁ బెద్దన గౌరవము పెద్దయయ్యెను.

ఒకనాఁడు కృష్ణగంధర్వుని కొడుకులు మృగయావిహారమునకై పోవుచుఁ దోడి యల్లుండ్రతోఁ బాటు బెద్దన్ననుఁ గూడ నాహ్వానించిరి. పణము లేనిదే రానని ఆతఁడు సమయము నేర్పాటు గావించుకొనెను. ఆతఁడు వనమును బ్రవేశించినది మొదలు తోడివారికన్నఁ దన చాతుర్యము నెక్కుడుగ నెఱపుచుండెను; పెక్కు మృగముల వేటాడెను. వారికొక్క మృగ మైనను జిక్కనీయకుండెను. అత్తటి వారందఱుఁ జిన్నవోయి అవమానితులైరి. పెద్దన్న పణవిధానము ననుసరించి వారి యూరువులఁ దప్తముద్ర లిడెను, కాకపక్షములఁ దఱిగెను. ఎల్లరును బెద్దన్నను క్షమింపఁ బ్రార్థించిరి. ఎటు మొసలిన నేమిచేయునో యని వెఱచుచు లోలోన నాతనిఁ జూచి మొగములు గంటుపెట్టుకొని భీతచిత్తులై

యుండిరి. తిరిగి నగర ద్వారమునకు రాఁగానే భట్టోకఁడు వచ్చి దక్షిణహస్త మెత్తి దీవించి కైవార మొనర్చెను. తక్కిన వారందర కది భరింపరానిదై 'తడిసి మూలుగు నక్కపైఁ దాటిపండు పడినట్లు' తలవంపు లయ్యెను. ఇది అంతయు రాజునకుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పిరి.

కృష్ణగంధర్వుఁడు సకల సద్గుణసంపన్నుఁడు. ప్రతాప మూర్తి; శాత్రవులకుఁ బ్రక్కలోని బల్లెము. కాని సహజ ముగా నెక్కొక్కప్పుడు శత్రువునేనిఁ గరుణించు స్వభావము గలవాఁడు. భూమీశుల కది యౌచిత్యమే గదా! అది మొదలు బావమఱఁదులు, తోడియల్లుండ్రు, పెద్దన్నపై లేనిపోని కొండెములు జెప్పఁ జొచ్చిరి. ఒక్కనాఁడు సమయ స్ఫూర్తిగ రాజుతో వారు "రాజా! ఈ పలువ వెలమయని తెలిసియో తెలియకనో పిల్లనిచ్చి వివాహ మొనరించి అతి పవిత్రమగు దినమణి వంశమున కపకీర్తిఁ దెచ్చితిరి. వర్ణ సంకర మయ్యెను. ప్రజ లెల్లరు మనల నాడిపోయుచుండిరి. తల యెత్తి తిరుగలేకున్నాము. ఏమి చెప్పుదుము? గతమునకై వగచిన లాభ మేమి? ఈతని నెట్లయిన నింటినుండి వెడలఁ గొట్టు నుపాయము వెదకుఁడ"ని అతని మనసు కకావిక లగునట్లొనర్చిరి. తదాది కృష్ణగంధర్వుఁడు పెద్దన్నపై విరోధము నగుపఱచు చుండెను. ఔరా! చెప్పుడుమాట లెంత చెడ్డవి! తనకూతు క్షేమ మైనఁ దలఁపడయ్యెను. భీమబలుఁ 'డగు పెద్దన్న నెదిరింపజాలక రాజొక్క పన్నుగడఁ బన్నెను.

కంచెర్లలోని నల్లచెర్వు సమీపమునను నిత్యము రెండు గంధర్వాశ్వములు వచ్చి ప్రాంత క్షేత్రముల చణక సస్యమును శాద్వల భ్రాంతిని మేయుచుండెను. అచ్చటి కాపరులు బలురకముల సాధనముల వానిఁ బట్ట నుంకించిరి. కాని యెంతకు నవి చిక్కక యుప్పరంబున కెగసి పోవుచుండెను. అందొక్కటి ఒక్కనాఁ డుప్పరంబున కెగయుఁడు ప్రసవించెను. అత్తఱి మునగాండ్రు కొందఱా గోడిగను బట్టఁ బోయిరి. మూఁడువేల మనిసుల నొక్క తాపున వెనుక కాలితో నుక్కడగించి పరువెత్తెను. తుదకా హయార్భకము ననన్యజనసామాన్య మైనదని చింతించి రాజు దాని నొక్క ఉక్కు మందసమునఁ బెట్టించి సాకుచుండెను. దానిని 'కార్బొల్ల' డను పేరుతోఁ బిలుచుకొను చుండిరి. కృష్ణ గంధర్వుఁడు తనచిన్నల్లుఁడగు పెద్దన్నకు దాని నరణముగానిచ్చి “ఓయీ! దీనిని చిన్న దని తలఁపక స్వారి చేయు” మని సాకూతముగఁ బల్కెను. 'తానొకటి దలఁచిన దైవ మొకటి దలఁచు' నానుడి మఱచెనో ఏమో! పెద్దన్నకు స్వారిచేయుట యన్న నల్లేరుపై బండినడక వంటి దని తాఁ దెలియఁడయ్యెను. అశ్వారోహణమం దందెవేసిన చేయి అగుట నట్టియెడ వాని యుత్సాహము వర్ణనాతీతముగ నుండెను. పుణ్యస్త్రీ లందఱు మంగళారతుల నివాళించి సేసలు జల్లుచుండ బాలతురంగము నధిరోహించి పెద్దన గగనమార్గమునఁ దిరోహితుఁ డయ్యెను. ఆ యశ్వశిశువు గంధర్వలోకమును జేరి నిజమాతృ స్తన్య పానమొనరించి దానితోఁ గూడ నింద్రుని దర్శించి తిరిగి

భూలోకమునకుఁ జేరెను. పెద్దన్న మృతుఁ డయ్యె ననియే నాఁడు తలఁచిరి. కాని మహాత్ములకుఁ గూడ నసాధ్యుఁడు మూర్ఖచిత్తు లది యెఱుంగుదురు! అతఁ డశ్వము నెక్కి గగనపథమున మఱుఁగు వడినపు డాతనిపై బుట్టించిన ప్రవాదములకు ముక్తాలవాంబ ఆవేదనతోఁ జిచ్చుఱుక యత్నించెను. ఒక్కరైన నామె ననునయింపరు సరిగదా? తండ్రియే తుదకు చితినిఁ గల్పించి అగ్ని దజికొల్ప భటుల కాజ్ఞాపించెను. ఆ పతివ్రతాతిలకము భర్తృచరణవిన్యస్త హృదయయై శ్రీమన్నారాయణునకు సమస్కరించుచు —

"పతి నెడబాయకుండ భవబంధ చయంబులఁ బొందకుండ దు
ర్మతులను జూడకుండ, ననురక్తి మిముం గొనియాడుచుండ, స
ద్వ్రతములు సేయుచుండ సురవల్లభముఖ్య సమస్తదేవ వ
ర్ణిత చరణారవింద! కరుణింపవె నాకొక జన్మ ముండినన్."

అని ప్రార్థించి చిచ్చుఱికెను. అంత నవ్వీతిహోత్రుఁ డా సతీతిలకము తలపై ధరించిన పూలదండ నైన వాడ్చకుండఁ జల్లఁబడెను. అత్తఱి బెద్దన్న గగనవీధి నుండి శరవేగంబున నచ్చటఁ బ్రత్యక్ష మయ్యెను. తోడనే యామె భర్తృ పాదముల కెఱఁగెను. ఆతఁడు నామెఁ గరముల లేవనెత్తి వారువముపైఁ గూర్చుండఁబెట్టికొని క్రోధమూర్తియై కంచెర్లపైఁ బడి గగ్గోలుజేసి కృష్ణగంధస్వామి సైన్యము నెల్ల నుగ్గునూచగ మట్టాడి ఎల్లర ముప్పుతిప్పలు బెట్టి దేవతలు వొగడ రూపుమాపెను. అంత వారి కగ్నిసంస్కారములు సేయించి తిరిగి పత్నీసమేతుఁడై అశ్వం బధిరోహించి 'పానగల్లు' ను పట్ట

ణముఁ జేరి అచ్చటఁ గల 'శనైశ్చరుని చట్టు' అను నొక్క శిలపై నామెను డించి అశ్వరంగము నచ్చటి తరుమూలంబునఁ గట్టివైచి సతీసమేతుఁడై సమీప తరుచ్ఛాయ నొక్కచో విశ్రాంతిగ నుండెను. ఆ కట్టివైచిన హయరాజము దక్షిణ చరణంబున నైజముగ నేలపై నొక్క తాఁపుఁదాఁపెను. దాని కాశిల బ్రద్దలయ్యెను. అందుండి మేఘగంభీర ధ్వనితో నొక్క 'కుక్కుటము' వెడలివచ్చి కలుషించి 'నన్నుఁ దన్నిన వాఁడెవ్వఁ' డని గర్జించెను. అప్పుడా గుఱ్ఱము " ఓ కుక్కుటమా! నే నీశ్వరానుగ్రహంబున నుద్భవించిన కార్బొల్ల డను పేరుగల గంధర్వాశ్వమను కాలజ్ఞుఁడను. కంచెర్ల గ్రామమున నుద్భవించిన వాఁడను " అని తన వృత్తాంత మును జెప్పిన నా చరణాయుధవరు " ఓహో! అశ్వమా! నీవు కాలజ్ఞుఁడవు మాత్రమే; నేను త్రికాలజ్ఞుఁడను. ఇంక నా వృత్తాంతము నెఱింగింతు వినుము.

పూర్వము ఫలదుఁ డను నొక ముని కొన్ని ఫలవృక్షముల నొకచో నాటి నీరువోసి పెంచి ఫలోత్పత్తి యగునెడ భక్షించుచుఁ గాలయాపనముఁ జేయుచుండెను. కొందఱు చోరులు తఱి వేచి ముని స్నానార్థ మేగిన నడిఁ గన్పెట్టి ఆ ఫలములం దొంగిలించిరి. ఆచౌర్యమును దాపసోత్తముఁ డెఱిఁగి తన మంత్రశక్తిచే నా తరువుల దహింపఁజేసి వాని భస్మముఁ గుండలకెత్తి తన యాశ్రమ ప్రాంగణమునఁ జల్లెను. మరల నీరువోయ నచ్చట వృక్షములు పునః ఫలవంతము లయ్యెను. మఱికొందఱు తస్కరు లీవిషయమును గ్రహించి హరింపనెంచి

కుక్కుట రుత మొనర్చిరి. ముని వేకువజా మయ్యెనని భ్రమ పడి నిద్ర మేల్కొని చూచి స్నానమునకు సమయము కాదని తెలిసికొని అంతరాత్మచే సర్వమును గ్రహించి కోపముతో నామువ్వురులఁ గుక్కుటము లగునట్లు శపించెను. అంత వారా సంయమిని శరణుఁ జొచ్చిరి. కరుణార్ద్రచిత్తుఁ డగు మౌని మరల శాపము నిట్లు గ్రమ్మరించెను. "ఓ చోరు లారా! మీరు కుక్కుటాండములై ఒక ఎఱుకవాని వలనఁ బెంచఁబడుచుండ నందొక్కటవిసి రెండుమాత్రము బ్రదుకును. అవిసిపోయిన గ్రుడ్డు మానవరూప మెత్తి హనుమద్బలుఁడై 'చెవుల గోపన్న' అనఁ బుట్టును. బ్రదికిన రెండు గ్రుడ్లును పెట్ట, పుంజులుగ జనించి పెట్ట 'పేర్దేవి' నాజనులకెల్ల దేవరయై పూజింపఁబడును. పుంజు దేవాంశ సంభూతుఁ డగు నొకని వలన ముక్తి గాంచు" నని తెల్పెను.

పిదప ముని యాజ్ఞాప్రకార మొక ఎఱుకువా నింట గ్రుడ్లేర్పడి పొదుగఁ బడుచుండెను. అందొకటి కుళ్లిపోయెను. మిగిలిన రెండు గ్రుడ్లును గ్రమముగాఁ బుంజు పెట్ట లయ్యెను. ఒకనాఁ డొక డేగ యెటనుండియో గగనపథంబున నేతెంచి పెట్టను వధించెను అది మృతి నొందుచు గీపెట్టెను. వెంటనే పుంజు డేగ నొక చిటుకలో నేలఁ గూలునట్లు కాలఁ దన్నెను. అదియే నేనుగా నుంటిని. ఇట్లే నా యెఱుక వీధిఁ గ్రుమ్మ రుచు నొక భిల్లుని పెంపకమునఁ బెరుగుచుంటిని. ఆ సమయ మున నఱువదార్గురు రాజపుత్త్రు లొకనాఁడు వేఁటకు వచ్చిరి. మృగయావినోదమున నలసిన రాజసుతులు శ్రమ

వాపికొనుటకై నన్నుఁ బెంచు భిల్లునింట విడిదిఁ జేసిరి. వారి కాతఁడు తగు రీతి నాతిథ్య మొసంగెను. వారి వెంటవచ్చిన వేఁటడేగలు కొన్ని నాపై కూరక కాలుద్రవ్వి దుడుకుచేఁతలు చేసినవి. దాని కేను గనలి ఒక్కొక్క తాఁపున నొక్కొక్క దాని నణగార్చితిని. కొంత తడవునకా రాజసుతులు తమ డేగల చందముఁ గని గృహయజమాని నడిగి నాచే చంపఁ బడినట్లు తెలిసికొనిరి. కోపముతో నారాకొమరులు నన్ను నాస్వామితోఁ గూడఁ దమ నివాసస్థాన మగు ఢక్కాపట్టణ మునకుఁ గొనిపోయిరి. అచ్చటఁ గొన్ని ఉక్కు తునకలవంటి కోళ్లు గలవు. వానితో నన్నుఁ బోరించిరి. పోరుటకు మున్ను 'ఓడినవారు బలవన్మృతి నొందవలెను' అని ఒక్క సమయము గావింపఁబడెను. దాని కేమొడంబడి పోర నారంభించితిమి. అందుఁబై చేయి మాదియయ్యెను. పణానుసారము రాజపుత్త్రు లందఱుఁ దన కుక్కుటములతో బలవన్మృతి నొంద వారి సతులును సహగమన మొనర్చిరి. అంత నాస్వామి నా శక్తి కచ్చెరువొంది కన్నుల కద్దుకొనుచు నెత్తుకొని యిటకు వచ్చి యీ చక్రటాతినిఁ బదిలముగ మూసిన ముత్యమ ట్లుంచెను. ఒక్కపెట్టున నిట్లువదార్గురు రాజపుత్త్రులను గూల్చుటఁ గాఁబోలు ' జెట్టిమల్లుఁ డనియు, మదనాలచిటిమల్లుఁ 'డనియు నామాంతరములఁ బేరొందితిని '' ఇది నా వృత్తాంత మని చెప్పి యొప్పెసఁగెను.

అది విని పెద్దన్న ఆ పుంజును గొనియాడి గుఱ్ఱము నెక్కి సతీ సమేతుఁడై అమరావతీనగరముఁ జేరి తల్లిఁదండ్రులకుఁ బ్రణమిల్లి సుఖంబుగ నుండెను.

---

## 3

అనంతప్రజానీకముతోఁ గలకలలాడు దరిద్రుని కాపురము ప్రూలె పుష్పచయముతోఁ నొప్పారు చూతవృక్షములు గల ఉపవనంబులును, పాంథుల శ్రమము బాపి నిరుపకారముగ ఛాయల నిచ్చుచు సజ్జన హృదయంబుల పోల్కి నొప్పారుచుండు వటవృక్షంబులును, నిర్మలోదక పరిపూరితంబులై కమలావాసంబు లగు సరస్సుల కుద్దియగు సరసులును, సస్యచయముతో నొప్పారు క్షేత్రజాలములును గలిగి ప్రకృతిశోభ సంతయుఁ దనలో నిముడ్చికొన్నదన్నట్లా శిశిరఋతువున నాగులేటి శోభను జూడ మనసుదవిలి అలుగురాజు బయలు వెడలెను. పరివారము గూడ నాతని వెంటనంటెను. పగలెల్లఁ బ్రయాణించిరి. సాయంకాల మయ్యెను. నాగులేటి దరిఁజేరిరి. అచ్చటి రామణీయకత హృదయరంజకముగా నుండెను. నాఁటి రేయి నాగులేటి నీట నందఱు మజ్జన మొనరించి భోజనాదులఁ గావించి సుఖసుప్తులైరి. కాని ఱేని చిత్తము మాత్ర మెందులకో కళవళ మందుచున్నది. కారణమేమియో

తెలియదు. క్షణములు యుగముల ట్లయ్యెను. నిద్ర రాదు. కనులుమూసిన శ్రీ చెన్నకేశవుఁడు గన్పట్టుచుండెను. ఇంతలోఁ గాలచక్రము తిరిగి అరుణుఁ డుదయగిరి నధిష్ఠించెను. పరివారము తేని స్నానముఁ జేయింప వారివారిగ సిద్ధపఱిచిరి. ప్రభువు నందుకొల్లమి పరివార మంతయు నెడయనితో నాగులేటిని గ్రుంకులిడిరి. తత్తీరముననే తన కిష్టదైవ మగు శ్రీ చెన్నకేశ్వరుని షోడశోపచారములఁ బూజించి బయలు దేరెను. అదేమి చిత్రమో కాని స్వామి అందుండి కదలఁ డయ్యెను. ప్రభువును నివ్వెఱపడెను. పరిజన మంతయు విత్తరుఁ జెందెను. ఆ కారెమప్రాడి వీటఁగల నీటుకత్తెలు మంచినీళ్ళకై బిందెలఁ జంక నిడి రా నద్భుత మంది చూచు చుండిరి. రాజసేవకులా కాంతలకు మ్రొక్కి తత్ క్షేత్రమహిమ దెలిసికొని రాజున కెఱిఁగించిరి. మన్నీఁడు దాని కెంతయునలరి అచ్చట నతిరమ్య మగు దేవాలయ మొండు నిర్మించి ప్రతిష్ఠాపనాదికము జరిపి స్వామినిఁ బ్రార్థించెను భూవిభుని భక్తికీశుఁడు సంతసించి తన జటాజూటము నుండి గంగ నంపెను. అయ్యది యచ్చటగల నాగులేటఁ గలిసి 'గంగధారమడుగు' నా నిప్పటికిఁ బ్రసిద్ధికెక్కెను. అలుగురా జఁటనుండియే గుర జాలను రాజధానిగఁ జేసికొనెను. సర్వలోక సమ్మతుఁడును, నిజధర్మ రతుండు నగు ప్రభువరేణ్యుఁడు శ్రీరామచంద్రుని వలెఁ బ్రజలఁ దనుపుచుండెను. బుద్ధిలో బృహస్పతియును, భోగమున నింద్రుఁడును, రూపమున నలుఁడును, దానమునఁ గర్ణుండును, బరాక్రమమున నర్జునుఁడు ననఁదగిన దొడ్డనా

యఁడు మంత్రిగా నున్న నాప్రభువునకుఁ గొదువ యేమి? ఆప్రజల యానందమునకు మేర యేమి? కాని తాను వృద్ధుఁడగు కతననో! పలనాటిసీమ ఒనర్చిన పుణ్యముకతననో దొడ్డనాయని మూఁడవ పుత్త్రుఁడు మంత్రి యయ్యెను. విష్ణ్వంశసంభూతుఁ డగు నీ బ్రహ్మనాయఁడు భారతకథను శ్రీకృష్ణుఁడట్లు పల్నాటి వీరగాథ కట్టి తెజోమూర్తి. ఈతఁడే యీ పలనాటి వీరనాటకమునకు సూత్రధారి. ఈతని చరిత్ర మతివిచిత్రమును పవిత్రము నైనది. ఇట్లుండఁ గొంతకాలము జన శ్రీ చెన్నకేశ్వరుని యనుగ్రహమున అలుగురాజునకుఁ గ్రమముగా పెద్దభార్య మైలమాదేవియందు నలగామరాజును, రెండవభార్య వీరవిద్యాదేవియందు పెద మల్లిదేవుఁడు, పిన మల్లిదేవుఁడు, బాలమల్లిదేవుఁడు నను ముగ్గురు పుత్త్రులును, మూఁడవ భార్య భూరమాదేవియందు కామరాజు, నరసింగ రాజు, ఝట్టిరాజు, పెరుమాళ్ళరాజు నను నల్వురు పుత్త్రు లుదయించిరి. వీరు క్రమముగ నష్టదిగ్గజముల వలె వీరవిద్యా నిపుణు లగుచుండిరి. రాజును ఆనందముతో రాజ్యమును బరిపాలించుచు దొడ్డనాయని పుత్త్రుఁడగు పెద్దన్నను జేరఁదీసిన చలువనగదా నిజవంశ మభివృద్ధిఁ బొందిన దని లోలోన మురియుచు మంత్రి సహాయుఁడై నిర్వక్ర పరాక్రమమున మహీచక్రము నేలుచుండెను.

“కాలః క్రీడతి గచ్ఛత్యాయుః” అన్నట్లు ప్రభు మంత్రు లిరువురును వార్ధకమునకు గుఱియై తమ పుత్త్రులకు స్వీయపదవు లొసఁగి విశ్రాంతిఁ జేకొనఁబూనిరి.

అది యొక చిన్న పల్లెటూరు. అందు మూఁడు వంతులు కాపు లుండిరి. వారును దైవభక్తులై వేఁకువను లేచి కాలకృత్యముల నెరవేర్చుకొని తమ పెంపుడుపసులఁ బోషించు కొనుచుండిరి. ఏయింటఁ జూచినను ధాన్యము మూల్గుచుం డెను. అతిథి అభ్యాగతులు వచ్చిరేని దిగులులేక ఏయింట నైన నాతిథ్యము దొఱకుచుండెను. ఎల్లరును మూఁడు నాల్గు సంవత్సరములకు సరిపోవు భోజన సంభారములఁ బూర్ణులై యుండిరి. క్షామదేవత కచ్చట తావే లేదు. ధర్మము నాల్గు పాదములతో నవ్వీట నడయాడుచున్నదన్న నది అతిశయోక్తి కాదు.

లోకమున నెంతవానికైన గ్రహచారము సరిగానున్న పుడే గదా పట్టినదెల్ల బంగార మగునది! పాపము! చౌదరి రామిరెడ్డికి మాత్రము ధనలోపమునకుఁ దోడు సంతతియం దును లోపమయ్యెను. అతఁడేమి చేయఁగలఁడు? అనుకూలవతి యగు నాతని సతి యెన్నియో నోములు నోచెను. ఆలుమగ లిద్దఱు గుట్టగుట్టకును, పుట్టపుట్టకును మ్రొక్కుచుండిరి. కాని సంతతి లేమి చింత మాత్రము వారి సర్వస్వమును గ్రుంగదీయుచుండెను. కలియో గంజియో త్రావుచు నెవ్వ రేని మహాత్ములు దమ గృహమున కేతెంచిన నున్నదానిలో నిసుమంతేనియు లోపముఁ గాకుండ నతిథిపూజఁ జేయుచుండిరి. కోటివేల్పులకు మ్రొక్కుచుండిరి. ఇట్లుండ నొకనాఁ డొక్క

మహాత్ముఁడు గోసాయి ఆ ' బిట్టగామాలపా ' డెల్ల గాలించి పట్టెఁ డన్నమునుగూడ సంపాదించుకొనలేని వానివలె కాపింట లేనితఱి నాతని యిల్లాలిని ' భోజనము బెట్టుము; తల్లీ ! నీకు సంతానభాగ్యము త్వరలో గల ' దని దీవించెను. దాని కామె వింతనంది చిన్నిబిడ్డల యాలింగన భాగ్యము మాబోటి ఆగర్భ దరిద్రులకా స్వామీ ! ' మీ రెవ్వరో మహాత్ములవలె నున్నారు. రండు; భుజింపుఁ ' డని కడుపార నాతని కోగిరి మొసఁగెను. అతండును ఆమె భక్తికి సంతసించి ' తల్లీ ! నీవు బిడ్డలకై వాపోవఁ జనదు. ఇఁటఁ గూర్చుండుము నన్నన్యునిగా భావింపకుము. నీ ముఖలక్షణములు జూడ ననతికాలమున సిరిసంపదలతోఁ దులఁదూగ గల వని తోచుచున్నది. సందియము లే ' దనెను.

ఇల్లాలు:— స్వామీ ! నమస్కారములు; అది తమ కెట్లు తోచెడిని ?

గోసాయి:— కాదు తల్లీ ! ఎవరిమాట యైన అసత్యము గావచ్చును గాని నా నుడి మాత్ర మెన్నటికి ననృతము గానేరదు.

ఇల్లాలు:— ఏమి యిట్లు గట్టిగాఁ బల్కుచుంటిరి స్వామీ ! తా మెవ్వరు ?

గోసా:— నే నెవ్వరైన నేమి ? ఉన్నది చెప్పెదను. త్వరపడకుము. వినుము.

పరశురాముడు క్షత్రియ సంహార మొనర్చు నపుడు ధరశేఖరుఁడు భీతిల్లి ఒక విప్రుని యింట దాఁగెను. ఆ ద్విజుని యర్ధాంగి నిండు చూలాలుగ నుండెను. పరశురాముఁ డుద్దీపించు కోపముతో నాయింటి యిల్లాలిని దన పరశువున కెఱఁ జేసెను. ఆమె గర్భమందుఁ గల బాలిక రివ్వున మింటిపై కెగయుచు 'ఓరీ! దుర్మతీ! నీవు యోచనలేక చేసిన అకార్యమునకు ఫల మనుభవింతువు; తప్పదు. నన్నొక సామాన్య శిశువుగా భావించితివి. కంసునియట్లు నీవు నాచే మడియుదువు. భూలోకమున నీవు జన్మించునప్పు డేనును వైరము సాధింతును పొమ్ము' అని ఆ బాలిక నుడివెను ఆమెయే నీకుఁ బుత్రిక కాఁగలదు. వెఱఁగొందకుము. ఇందుగల పరమ రహస్యమిది. ఇంక నాకు సెలవా? తల్లీ! నే పోయివచ్చెదను.

అని పల్కుచు గోసాయిక్షణములోనదృశ్యుఁడయ్యెను. దాని కాయమ నివ్వెఱఁగంది నిలువఁబడి చూచుచుండ నింతలోఁ గాపింటికి వచ్చెను. వెంటనే ఆమె జరిగిన దంతయు భర్తకుఁ బూసఁ గ్రుచ్చినరీతి విన్నవించెను.అతఁడు నబ్బురపడి 'ఆహా! మానినీ! నీజన్మము ధన్యము.మహాత్ముని గనులారఁ జూచితివి; వరమునుగంటివి. నాకాదివ్యపురుషునిఁ జూచు భాగ్యము లభింపదాయె గదా! ఐనను మహాత్ములయాశీర్వాద బలమెంత లెంతలు గానేరవు?'' అని పలుకుచు దంపతు లిరువురు మున్మురముగ మురిసికొనుచుండిరి. నాఁడా రెడ్డి దంపతు

లకుఁ గలిగిన యానందమున కవధియే లేకుండెను. మఱునాఁ డుదయమున కాల్యకృత్యములఁదీర్చుకొని రెడ్డి అఱకఁ దోలుకొని పొలమునకుఁ బోవుచుండెను. త్రోవలో నొక పొలము దాపున కంచెనానుకొని ఒక చక్కని బంగరు బొమ్మవంటి బాలిక ఏడ్చుచుండెను. రెడ్డి యాసద్దు విని బాలికం జూచి చంక నిడికొని అఱకఁ దోలుకొనుచు నింటికిఁ జనియెను. అతని యిల్లాలును ఆ నిసువునుజూచి మిన్నంది ప్రాణ ప్రదంబుగాఁ జెక్కు చెమర్పకుండగఁ బెంచుచుండెను. దంపతు లా బాలికకు 'నాగాంబ' యను నామకరణముఁ జేసిరి. వేయేల ? ఆ సతీపతుల యానందము మిఱిమీఱుచుండెను. కొనాళ్లకే రెడ్డికి పొలములో నాఁగటిచాలున నిధిగూడ లభించెను. సిరి సంపదలతో నలరారు కాపునకుఁ బట్టినదెల్ల బంగార మగుచుండెను. అతని కాయేఁడు గింజకుపుట్టెఁడు ధాన్యముబండెను. కలసివచ్చు రోజునకు సర్వమును అట్లే అగునుగదా ! బాలికకుఁ బెండ్లియీడు వచ్చెను. తండ్రి యాకన్యను మాచర్లలో గల ఓబలరెడ్డి కుమారుఁడు సింగారెడ్డికిచ్చి ఒక్క శుభ మహూర్తమున వైభవముతోఁ బెండ్లి గావించెను. అదేమి కర్మమోగాని ఆనాఁడే బంధుగులు గొందఱు మడిసిరి. ఆ మఱునాఁడే భర్త పరలోక గతుఁడయ్యెను. మూఁడు నాల్గు దినములలో నత్తమామలును, తలిదండ్రులును పురోహితుఁడును దివికేగిరి. పాప మా బాలికగుండె రాయి అయిపోయెను. జను లామెను జూచి ఈ యినుపగజ్జెలతల్లి ఎక్కడ దాపురించెను? పుట్టి మెట్టిన రెండు కాపురముల నూచఁ ముట్టగ నాశ

నముఁ జేసిన ' ఆదిశక్తి ' అని తలఁచుచుండిరి. ఆమె మాత్ర మెవ్వ రెన్ని యన్నను జంకక రక్కసివలెఁ బూర్ణాయువు గలిగి వర్ధిల్లుచుండెను భాగ్య మున్నవారికి భయ మేమి?

బాల్యమునఁ దల్లిదండ్రులు నేర్పించిన విద్యల నానాఁటి కభివృద్ధిఁ జేసికొనుచు జట్టుపట్ల గ్రామిణుల వ్యవహారములను బురుషుల కంటె ఎక్కుడు నేర్పుమెయిఁ జక్క దిద్దుచుండెను. ఒక వంక యుద్ధనైపుణ్యమును, వేరొక చక్కి రాజ్య మంత్రాంగము లందు దక్షతఁ గలిగి సవ్యసాచిత్వమును జూపుచుండెను. సమీపమునఁ గల రాజధాని కేగి రాజు పరిచయము నెక్కుడుగ సంపాదించెను. అలుగురాజును వేఁట కేగునప్పు డెల్లఁ దన వెంట నీమెను గూడఁ గొనిపోవుచుండె నన్న మృష గాదు. పెక్కులేల? భూవిభుని ప్రాపక మందినది మొదలు నాఁడు నాఁటికి మంత్రిపదవికి గూడఁ దగిన దన్నట్లు మెలఁగుచుండెను. రాజసభకు వచ్చుచు పోవుచు నచ్చటి విశేషము లన్నియు నవగత మొనర్చుకొనెను. రాజీమె కొసఁగిన స్వాతంత్ర్యతా కారణముగఁ బ్రజకును, మంత్రి యగు దొడ్డనాయనికిని గొంత ఆమెపై నసూయ జనింపకపోలేదు. మహారాజుపై నాఁడు పూలు రువ్వినవారు నేఁడు రాలు రువ్వ సాగిరి. నాయకురా లేదియెట్లు జరుగుచున్నను బ్రభు మంత్రుల నడుమఁ గుట్రలు సేయుచునే యుండెను. ఒకప్పుడు తానే మంత్రిణిగా నుండ నిశ్చయ మూనె గాని అట్లున్నఁ దానాడఁ దలచుకొన్న నాటకమున కాటంకము గలుగు నని యెంచి రాజుతో దొడ్డనాయనిపై లేనివెల్లఁ గల్పించి చెప్పి మంత్రి

పుత్త్రుని బ్రహ్మనాయని నాస్థానమున మంత్రిగా నియమింపఁ జేసెను. ఆమె మంత్రము పైఁబైన మిట్టపెత్తనములు జేయుచు పరివారము నట్టిటుల దిద్దుచు రాజుకడ శృంగ నీతులు జెప్పుచు గొలఁది కాలముననే రాజసచివుల నడుమ గోరంతలు గొండంతలు జేయుచుండెను.

ఒకనాఁడు బ్రహ్మనాయఁ డెప్పటివలె రాజసభ కేగెను. ఆ సమయమున నాయకురాలితో రాచకార్యముల ముచ్చటించుచు అలుగురాజు పరివార సమేతుఁడై యుండెను. అప్పుడు బ్రహ్మన్న యథాప్రకారము సభలోఁ బ్రవేశింప రాజు లేచి నమస్కరించెను. నాయకురాలికా సంఘటన కడుపు కోతగా నుండెను. తరువాత నేమేమియో రాజమంత్రు లిరువురు సంప్రదించుకొనిరి. కొంతసేపునకు రాజానతిపై మంత్రి వెడలిపోయెను. నాయకురా లందే యుండి సమయముఁ జూచి రాజుతో నిట్లు సంభాషణ గావించెను.

నాయ:- రాజా! నా దొక్క మనవి; కినియరు గదా?

రాజు:- అట్లెన్నడైనను జరిగెనా?

నాయ:- లేదు; లేదు. కాని రాజచిత్తము లెప్పు డెట్లు చరియించునో! అని ......

రాజు:- అది ఎవ్వరియెడ నైనఁ గావచ్చునుగాక, నీయెడనా?

నాయ:- అయినఁ దెలియ కడుగుచుంటిని; ప్రభువులకు ముందుగ మంత్రి నమస్కరించుటో? మంత్రికి ప్రభువు నమస్కరించుటో? తెలియక సందియ మగుచున్నది.

రాజు:- నా నమస్కార మంచులకు గాదు. బ్రహ్మనాయుడు ధర్మమూర్తి; త్యాగశీలుడు; ప్రజల కష్టములను విని గన సహింపజాలని మెత్తనిచిత్తము గలవాడు; శమదమాది గుణ సంపన్నుడు; మహాచతురమతి; రాజ్యవు విషయ మెఱుగఁగల మహనీయుడు. నీతిలోఁ జాణక్యుడు; రణములో భీముడు. శౌర్య ధైర్యాది గుణము లాయన సొమ్ములు. పరదార ధనాదు లన్న విషప్రాయములు.

నాయ:-కావచ్చునుగాక! ప్రభువులకు లోకవృత్తము లామూలాగ్రముగాఁ దెలియవను కొందును.

రాజు:- ఏమది? అట్లనుచుంటివి?

నాయ:- దేవర వేఱుగా భావింపవలదు. ఆతని చరిత్ర లోక మెఱిఁగినంతగాఁ బ్రభువుల చెవినిఁ బడదేమో అని సంశయము.

రాజు:- ఆ అపయశమేమి?

నాయ:- సంగ్రహముగాఁ జెప్పెదను. శ్రద్ధాళువులై వినఁబ్రార్థన. మన యాస్థానమున దివాకీర్తి 'తెప్పలి' అను వాని నెఱుఁగుదురుగదా? ఆతఁడు ప్రభు మన్ననకుఁ బాత్రుఁడనియే యెంచెదను. ఆతని భార్య రూపసి. అదియే వానికి శత్రుత్వమయ్యెను. ఒక్కనాఁడామె ఋతుమతియై స్నానించి వచ్చుచుండఁ ద్రోవలో మీ మంత్రి బ్రహ్మనాయఁ డెదురుపడియెనట.

రాజు:- అందు వింతయేమున్నది?

నాయ:- ఆమెయు నాయుడుకు నమస్కరించి ఆతని సంతాన వరమడిగెనట; దాన నాతఁడు సంతానము ననుగ్రహించెననియు, నాతఁడే 'ఆర్లగొండపై దాడి వెడలి భిల్లుర నెల్లఱఁ దునుమాడిన వీరుఁడు 'కన్నమదాసు' అని లోకులుముచ్చటించుకొందురు. ప్రసంగ మొచ్చినది గనుక నింతగాఁ జెప్పవలసి వచ్చినది. ఇందలి తప్పొప్పులను దేవరయే గ్రహింతురుగాక!

రాజు:- గ్రహించుట కిందేమున్నది? ఆతఁడు విష్ణ్వంశ సంభూతుఁడే కదా?

నాయ:- అదివెట్లు పొసఁగును?

రాజు:- వర మిచ్చియుండును; సంతతి గలిగియుండును. దానఁ దప్పేమి? నానమస్కారమునకు గారణము వినుము. దొడ్డనాయనిభార్య శీలాంబ గర్భవతియై పండ్రెండు సంవత్సరములు చూలాలుగ నుండెను. కొందఱు దానిని గుల్మమనియు, మఱికొందఱు వ్యాధియనియు నేమేమో భాషింపుచు వచ్చిరి. వైద్యులు మాత్రము మహానుభావుఁ డొకఁడుదయించునని జోస్యము జెప్పుచుండిరి. కొంతకాలమున కామెకు బిడ్డనొప్పులు ప్రారంభమయ్యెను. ఎందరో మంత్రసానులు వచ్చి కాపుఁ గాయుచుండిరి: కాని ఆమెకుఁ బ్రసవవేదన విడివడదయ్యెను. ఇట్లుండ నాయూర బావికడ నొక

కాషాయాంబర ధారిణి బ్రహ్మచారిణి విడిసియుండెను. కర్ణాకర్ణికగా నీవిషయ మామె చెవిసోకెను. ఆమెయు మంచినీళ్లకై వచ్చి అమ్మలక్కలతోఁ దనకు మంత్రసాని తనమునఁగల నైపుణ్యమును గట్టిగఁజెప్పి శీలాంబికా సూతికాగృహము బ్రవేశించెను. వెంటనే మందులు మాకులు నుపయోగించి గర్భస్థ శిశువు మృతినొందఁ బ్రయత్నించెను. కాని 'దుష్టరం కిమ్మహాత్మనాం' అనునట్లు దివ్యావతారుఁడగు నాశిశువు సురక్షితముగ నుద్భవింప శీలాంబ మూర్ఛఁజెందెను. పురుషుఁడు పుట్టెనను కలకల మారంభ మయ్యెను గాని మంత్రసాని తన పూర్వ వైరము సాధింపనెంచి పరశురామావతారుఁడగు నాశిశువు నచ్చటి చట్రాతి పై బాదెను. ఆదెబ్బ కందు బిలమేర్పడి దానశిశువు పాతాళమున కేగి సంజీవ మణిచే సురక్షితముగా బ్రతికింపఁ బడెను. మంత్రసాని తాననుకొన్న కార్యము మఱొక్క రీతిగాఁ బరిణమించినదని లోలోనగుందుచుఁ దవ మంత్ర శక్తిచే నదృశ్య మయ్యెను.

నాయః— (చిన్నవోయిన మోముతోఁ దలవంచుకొని ఇంచుక సేపూరకుండి వినమొల్లనిదానివలె నటించుచుండి ) రాజా ! ఇఁక సెలవా ?

రాజు:— అదేమి ! సముగ్రముగా వినిపొమ్ము. ఆపిమ్మట నింటివారెల్ల శిశువుఁగానమిఁ గుందుచు శీలాంబను

మూర్ఛనుండి తేల్చుట కుపచారములు గావించు చుండిరి. ఆమెయుఁ గొంతవడి లేచి బిడ్డపైఁ గల మక్కువచే నారాతిబిలమునఁ బ్రవేశించెను. సాధ్వీమ తల్లులకుఁ జొరరాని చోట్లుగలవా? ఆవివరమున నామె చని చని తనబిడ్డ యునికి గ్రహించి అచ్చటివారి యనుమతిపైఁ జంకనిడికొని ఆలోకమువారిచ్చిన క్రీడా కనక కందుకమును గూడ వెంట నిడుకొని భూలోకమునకు వచ్చెను. ఆతఁడే బ్రహ్మన్న. సామాన్యుఁ డనుకొంటివా? కావుననే మన్నమస్వా ర్వాఁ డయ్యెను. అతనిపట్ల నెవ్వరు నన్యథా తలంప రాదు. తలంచిరేనిఁ గీడునకుఁ బాత్రులగుదురు.

నాయ:— రాజా! అంతపనియా? వాని చరిత్ర నాకుఁ గ్రొత్త గాదు. దేవర సెలవైన వెళ్ళివచ్చెద నని నిజావాసముఁ జేరెను.

మఱునాఁ డలుగురాజు చెప్పటియట్ల సభ నలంక రించెను. ఒక్కచో నొక్క ఉక్కుకంబమును, వేఱొకచో గాజుకంబమును సభామండపమున కలంకారముగా నుండఁ జేసిరి. దీని రహస్యము గూఢచారుల వలన నాయఁ డెఱిఁగి "ఔరా! నాయకురాలు రాజవరు నెట్లుగాఁ దయారుఁ జేయుచుండెను? ఎవరి కర్మమును వారే అనుభవింతురు. కానిమ్ము. కానున్నది కాకమానదు" అని రాజాస్థానమునఁ బ్రవేశించెను. ఏలికయు ఎలనాగ నాయకురాలును రాచకా

ర్యముల ముచ్చటించుకొనుచుండిరి. యథాపూర్వముగ నాయఁడు లోనికిఁ బోవుచుండ నెట్టయెదుట నున్న గాజుకంబముఁ జూచి దాని వింత కచ్చెరువంది శిల్ప నైపుణ్యమునకు నమోవాక 'మిడెను. మహాత్ముల నమస్కారము లసామాన్యములు గదా ? వెంటనే ఆ గాజుకంబము వేయి వ్రక్కలై నేలఁ గూలెను. రాజది చూచుచునే ఉండెను. కొంతదూరమున నల్లే పనితనము గల ఒక ఉక్కుకంబమును గాంచి దాని చేతను జోహారొనర్చెను. అదియు, నశనిపాతము వ్రాలె బ్రద్దలై పుడమిఁ గూలెను. ఆ రవమునకు సభికు లెల్లరు నిశ్చేష్టులైరి. నాయకురాలింకను జూచుచుండెను. రాజు బ్రహ్మన్నను జూచియు జూడన ట్లుండెను. నాయఁ డది గ్రహించి 'రాజా ! ఇదే నమస్కార' మని నాయకురాలి వైపు చురచురఁ జూచుచు నెక్కచో నాసీనుఁ డయ్యెను. ఆక్షణముననే రాజుగారి వెన్నెముకన రాచపుండు పుట్టెను. అది యెల్ల బ్రహ్మనాయని మహిమ యని గ్రహించి వానిని క్షమింప వేఁడి తన పుత్త్రుల దొడ్డనాయని కప్పగించి కొలఁది దినములలోఁ గాలధర్మము నందెను. దొడ్డనయు నా రాజ్యమునకు నలగామరాజును పట్టాభిషిక్తునిఁ జేసి పెదమల్లి దేవాదులఁ బ్రీతిగఁ బెంచుచుండెను.

మృత్యు వెంతవారలకును దప్పదు గదా ! దొడ్డనయు వయస్సు చెల్లినవాఁడు గావున రాజు గతించిన కొన్నాళ్లకే తానును స్వర్గ మలంకరించెను. పిదప బ్రహ్మనాయఁడు నలగామరాజుకడ మంత్రియై తన తండ్రియట్లె రాజసోదరుల

నోముచు రాజ్యమును జక్కదిద్దు చుండెను. నాయకురాలి పరిచయ బోధల నలగామ రాజామె చేతి కీల్బొమ్మయై యుండెను. బ్రహ్మన్న శీలమే దాని నెల్ల నణచియుంచెను. అట్లయ్యు నే యొడుదుడుకులు లేకుండగ శ్రీ చెన్నకేశు నను గ్రహమున గురజాల రాజధానిని నలగామరాజు నిర్విచార ముగఁ బాలించుచుండెను.

---

౫

అది మండువేసవి. చండభానుని ప్రచండ కిరణములు దశదిశలు వ్యాపించి జీవకోటిని దపింపఁ జేయుచుండెను. ఎక్కడ జూచినను నీరు లేకుండెను. పిట్ట తెలకాయ పగులు నట్లు మండు టెండలు మనుజుల నెల్ల నీరసింపఁ జేయుచుం డెను. సుడిగాడ్పులు రివ్వున విసరుచుఁ బుడమిపైఁ దుమ్ము నంతయు బొంగరము ద్రిప్పిన కైవడి దిద్దిరం ద్రిప్పుచుండెను. జాము ప్రొద్దెక్కినఁ ద్రోవ నెవ్వరును తిరుగుటకు వీలు లేకుం డెను. ఎండమావులే గొప్ప నదు లయ్యెను. చల్లని వటచ్ఛా యలే పాంథాళికి సౌధము లయ్యెను. రాజులు మృగయా వినోద మొనర్చుట కది సమయ మయ్యెను. నదు లెండిపో వుట సేనలకు రహదారి యయ్యెను. నాగులేట నీరు నాగు బాము రీతి సన్నగ జాలువాఱు చుండెను. పుణ్యాత్ము లచ్చ టచ్చట చలువ చప్పరముల నేర్పఱచి పాంథులకు విశ్రాంతి

నిచ్చుచుండిరి. సూర్యభగవానుఁడు నిండు యౌవనముతో నొప్పారుచుండెను.

ఆ యెండవేడిమికి తాళలేక ఎవ్వఁడో ఒక దివ్యపురుషుఁడు వీరబల సమన్వితుఁడై ఒక చలువపందిరిని విడిసి యుండెను. పరివార మంతయుఁ బ్రపాశాలల విశ్రాంతిఁ గైకొనిరి. పాఁశాలా రక్షకులా నూతన వ్యక్తికి శైత్యోపచారము లొనర్చుచు మృగయావినోదమున గల్గు శ్రమను బాపుచుఁ దమ కర్తవ్యముల నిర్వహింపు చుండిరి. అంత నా వ్యక్తి శ్రమఁ దేఱి ఆహా! ధన్యుఁడను. ప్రాణములు నిల్చినవి. ఎవ్వరీ పరోపకారపారాయణులు? "నాయనలారా! ఎవ్వరీ ప్రపానిర్మాతలు? వారికి నా ధన్యవాదములు" అని పరిశ్రమాపనోదనుఁ డగుచు — 'ఇప్పట్ల నా ధర్మమూర్తులగుపడ్డ వారికోర్కె లెట్టివైనను దీర్పవచ్చు ననిపించుచున్నది' అని మనసారఁ బల్కుచుండ లోపలినుండి ఒక యువతి వెలుపలికి వచ్చి ఆ మహనీయుని దరిసి 'రాజా! నమస్కారములు. ఎవ్వరో అనుకొంటిని. దేవర యని గ్రహింపనైతిని. అయినఁ బ్రభువులీ మండువేసవిలో వనముల దండఁ దిరుగ మృగయావినోదార్థ మనియే తలఁచెదను. నిజమేనా?

రాజు:— అవును. ఆ ప్రయత్నముననే వచ్చి యిటఁ బ్రాణములు దక్కించుకొంటిని. ఇట్టిమరుభూముల సుఖకరములగు వసతులఁ గల్పించిన పుణ్యమూర్తు లెవ్వరా? యని యోచింపుచు నాయకురాలికన్న నింతటి సమర్థ

లెవ్వరా ? అని యనుకొనుచుంటిని. ఇంతలో. నీ పగుపడితివి. మఱింత సంతస మాయెను. మనసు సేదఁ దేఱెను.

నాయ:— ప్రభూ! శక్తికొలఁదిగ నీదీనురాలే దీనికిఁ గార ణము. ఒక్కమనవి. మహాత్ముల రాకచే నా జన్మము ధన్యమైనది. ఈ దీనురాలి చ్చువిందునుగూడ స్వీకరించి తరింపఁజేయవేఁడెదను. ఇఁక దేవరచిత్తము;నాభాగ్యము.

రాజు:— (చిఱునగవుతో) ఓ తరుణీమణీ! నీ సపర్యలకు సంత సించితిని. లోకము కొనియాడు నీ చేఁతలకు మెచ్చి తిని. మాకన్నియు సమకూరినట్లే. విందుఁగొన్న నొక్కటియు, గొనకున్న నొక్కటియునా? వెళ్లి వత్తును. నీ కేదేని కోర్కెయున్నఁ దెలుపుము. తీర్ప సంసిద్ధుఁడను.

నాయు:— మహారాజా! కోర్కెల కేమిగాని తమ యనుగ్రహ మున్నఁ బెన్నిధి లభించినట్లే. రాజాశ్రమయమున లభిం పని భాగ్యములున్నవే ? దీనులయెడ ననురాగముఁ జూపు మీ యుదారతకు నే నెంతయు సంతసించు చుంటిని.

రాజు:— కాలాతీతమగుచున్నది. పోవలయును. నీ కామిత మేదియో తెల్పుము.

నాయు:— తెల్పుట కేమున్నది? తలచి తలచి అడుగుచుంటిరి గాన చెప్పక దీరదు. ఏలినవారు చిత్తగింపఁ బ్రార్థన.

అది నాకెంతకాలమునుండియో మనసులోఁ గలదు. చల్లకువచ్చి ముంత దాపనేల? దేవర మన్నింతురా! వెలువడ విన్నవింతును. (కొంచెము సేపూరకొని) ఆగ్రహింపరుగదా?

రాజు:- ఇందాగ్రహమున కేమున్నది? తెల్పుము.

నాయ:- సత్యసంధు లాడినమాటను దప్పరనియే భావింతును. (కొంచెము తలవాల్చి) నేను ... పురుషునివలె ... దేవర ... సింహాసన మొక్కయామ మధిష్టించి ప్రభుత్వము ... చేయవలయునని వాంఛ. అంతియే. (అని మెల్లమెల్లగ వెలిబుచ్చెను)

రాజు:- అట్లే నిశ్శంకగ నేలుకొన వచ్చును. ఇదిగో నా ముద్రాంగుళీయకము. దీనికెంతగా బ్రార్థింప శంకింపవలయునా? (అని తన వేలిముద్ర నీయఁబోయెను.)

నాయ:- 'మహాప్రభూ! ఇపుడువలదు. నీ యుదారతకు నా జోహారులు అవసరమునుబట్టి వేఁడుకొనియెదను. రాజభూషణము లంగనలు ధరింపరాదేమో! నాఁడే చేకొనియెదను' అని వినయముతో నూరకుండెను. పిదప పృథ్వీపతియు దన పరివారముతోఁగూడ రాజధానిఁ జేరి సుఖముగ నుండెను. నాయకురా లెప్పటిరీతిగా సభాస్థానమునకు వచ్చుచుఁ బోవుచునుండెను.

ఇట్లుండ జమాబంది రోజులలోఁ బ్రజలెల్లరు బ్రభువునకుఁ బన్నులన్నియుఁ జెల్లించి రాజాజ్ఞఁ గొనిపోవు చుండిరి.

ఆ ధనమంతయు నొక్కరాశిగానుండెను. ఒక్కనాఁడు నాయకు రాలదిచూచి విచారించుకొని రాజుతో రాజా ! నాఁటి సమయ మిప్పుడు వచ్చినది. ముద్రాంగుళీయక మిప్పించెదరా' అని ప్రార్థించెను. అడుగుట తడవుగనే ఉర్వీశుఁడామెకుఁ దన వ్రేలి ముద్దుటుంగరము నిచ్చెను. ఆమె దానినిఁ దన వ్రేలఁ దవిల్చికొని సింహాసనమెక్కి రాజ్యమును బాలించుచుండెను. జిట్టగామాలపాడులోఁ గల తన సైన్యమునెల్ల రాఁబనిచి 'ఓ వీరాగ్రేసరులారా ! మీరందఱు మోమోటము లేకుండ, జంకుఁ గొంకులమాని మనరాష్ట్రమునఁగల సర్వవర్ణములవారి సర్వస్వమును దీసికొనిరండు. లేదేని మీప్రాణములు మీవి గావు' అనుచు నిజాజ్ఞా పత్రములనిచ్చి భటుల నంపెను. వారును వెనుక ముందులుచూడక అల్పాధిక్యముల నరయక రక్కసులవలెఁ బ్రజల బాధించుచు మంగళ సూత్రములతో సైతముఁ గొల్లఁగొట్టి చిటికలో నాద్రవ్యమునంత నప్పగించిరి. ఆద్రవ్యమును సింహాసనోభయ పార్శ్వముల రాసులుగఁ బోయించి రాజుఁబిలిచి ద్రవ్యమునుజూపి కాలపరిమితిసమాప్తమైనదని మరల రాజునకు ముద్రాంగుళినిచ్చి నిలుచుండెను. రాజును ఆ ధనరాసులనుజూచి 'ఎక్కడిదీద్రవ్య'మని నాయకురాలిని బ్రశ్నించెను. ఆమెయు ద్వేషభావ ముట్టిపడ మొగము చిట్లించి ఇదియా ? మన దివాను ద్రవ్యమే ! ప్రతి యేఁడు నింతటిధనము మనకు నష్టమగుచునేయున్నది. కోశాగారమునకు మాత్రము చేరుట లేదు. దానిని ప్రభువులే గ్రహింతురు గాక !

"నీమాటల్వినినట్లు యుండియు భవన్నిత్యప్రతాపంబుఁ గ్రీ
డా మాత్రంబుగఁ జూచు మెచ్చఁడతి మూఢస్వాంతు డెల్లప్పుడున్
స్వామి ద్రోహముఁ జేసి రాజ్యమున సర్వద్రవ్యముల్ దానె మా
యా మూలంబున నిల్లుఁ జేర్చుకొను బ్రహ్మనాయుఁ డుర్వీశ్వరా"॥

ఇతనిని మంత్రిగా నుంచుకొని సర్వస్వము నాతని కొసఁగినారు. బాగుగ విచారింపుఁడు. రాజా! నేనాఁడుదానననిసంశయింతురేమో – సర్వమును గ్రహించుచునేఉంటిని. కాని ప్రభువుల కివియన్నియుఁ జెప్పినచో నుల్లమాటలగునేమో అని యూరకొంటిని. నేఁడదియంతయు తెలిసినవారికే విదితమయ్యెను. ఏదేని ప్రజలీనాఁడింత ధనమును కప్పములక్రింద నెట్లు చెల్లింతురు? కాన మహాత్మా! బ్రహ్మనాయని కింతటితో స్వస్తిజెప్పకున్న రాజ్యము నానాఁటికిఁ దీసికట్టగును; యోచించుకొనుఁడు. అన్యథా భావింపఁదలదు. వేయేల? తమ యాజ్ఞయైనచో మన నగరమును స్వర్ణభిత్తికలతోఁ దయారుగావింపనా? అబలనని శంకింపఁదలదని నామనవి". అనిన ఆ మెలనాగ పలుకుల వలలోఁ దలచిక్కి ఆనాఁడు మొదలు బ్రహ్మనాయని యందల్పబుద్ధి గలవాఁడై అనాదర భావముఁ జూపుచుండెను. ఔరా! దుర్బోధలెంత రుచికరములైనవి.

నాయఁ డది యెల్ల నెఱిఁగియు యథాప్రకారముగ నిత్య జీవనోపాధికిఁ దక్కఁ దక్కిన ధన మంతయు — రాజధానికిఁ జేర్చుచునే యుండెను. నృపుఁడు బ్రహ్మనాయని పదవికి సున్నఁ జుట్టి నాయకురాలి నందు నియమించెను. ఆహా! కాలమహిమ అనివార్యము! నాయకురాలి ఆనందమున కంతు

లేకుండెను. ప్రజలకు బాధ లెక్కు డయ్యెను. నిరాటంక పరిపాలన మారంభ మయ్యెను. ప్రజలకును ప్రభువునకు నడుమ వైరనేపథ్య మడ్గు దగుచుండెను.

---

౬

బాల మల్లిదేవాదులు బ్రహ్మనాయు నింటఁ బెరుగుచు రాజనీతి శాస్త్రము లభ్యసించుచుండిరి. సాము గరిడీలు నేర్చుచుండిరి. నాయకురా లది యెఱిగి మాయోపాయము లచే నెట్లైన నాయని కన్ను మూసి వారి నందఱ నణగార్పఁ బూనెను. గొల్లడాలు బిడ్డకుట్టె మెఱుంగున్న. తెచ్చికోలు ప్రేమను వారిపైఁ జూపును. తన సర్వస్వము వారుగనే భావించును. ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డ లని పలుమాఱు లెత్తి ముద్దాడు చుండును. రాజసుతు లని కొంతవడి భక్తినిఁ జూపును. అప్పు డప్పుడు వారి కిక్షు ఖండములు, తేనియ, నారికేళములు, ఖర్జూరములు మొదలగున వొసఁగి విద్య లారయు చుండును. చిత్తమున మాత్రము వారిని శిక్షింపఁ జూపును. ఒక్క తఱి

"పురకాంతల్ విపణిం జరింపఁ గని యా పూఁబోఁడి వక్షోరుహాం
తర మొప్ప స్గుఱిఁ జేసి కందుకములం దాకంగ వైపించు బా
సుర భూపోప వన ప్రవర్ధిత కుజ క్షోభంబుఁ జేయించు బా
లురచే నిచ్చలు దక్కుచేష్టలకు నుల్కన్ దత్పట్టణం బెంతయున్"

మఱియు నొక్కసారి ఆ రాజపుత్త్రులచే నీరుఁ దెచ్చు యువతుల పూర్ణకుంభములకుగురిగా బాణముల వేయించును. వారేమని అందురని ముందుగనే మైనమంటింపుఁడని ఆ పడఁతుల కుద్బోధించును. వారి కుటిల కృత్యముల కాబాల గోపాలము గగ్గోలువడి వారిపై ఈర్ష్యాసూయలఁ జెందు చుండిరి. ఏమియు నెఱుఁగని నంగనాచివలె నాయకురా లీ బాలురకు చేష్టలనెల్ల మేదినీపతి పజ్జఁజేరి వారిపైగూడ కత్తి నూరునట్లొనరించు చుండెను.

ఒక్కనాఁడామె హాస్యమునకు బాలురఁబిలిచి నాయనలారా! మింటిపైఁ జూడుఁడు; గరుఁడుని ఱెక్కలు తెగి నేలఁ బడునట్లొనర్చిన మిమ్ము బలశాలురని తలఁచెదను. లేకున్న పిరికి దొరలనుకొనియెదను' అనిపలుక నామాటలకు పెద్దవాఁ డుల్కిపడి 'ఇదియు నొక పనియేనా?' అని రివ్వున నొక్క వెడదవాతియమ్మున నా విహంగమమును నేలఁ గూల్చెను. అది క్రిందఁబడెను. ఆ సమయమున రాజచ్చటికి వచ్చెను. వానినిఁజూచి అందఱును భీతిల్లిరి. ఆకలుషపువెలఁది అంతలో మెల్లన వారిఁజేరి "మనుజనాథా! ఏలినవారి కులగౌరవ మెక్కడ? ఈ మంకుఁగీంద్రోసర్చు పనులెక్కడ? మీకును వీరికిని హస్తిమశకాంతరము గలదు. వీరు దుడుకు చేష్టలు మానకున్నారు. నన్ను ముప్పుతిప్పలుబెట్టి మూఁడు చెఱువుల నీరు త్రావించుచున్నారు బ్రహ్మనాయని కుతంత్రములన్నియు దలకెక్కి నాబోధలన్నియు బూడిదఁబోసిన పన్నీరగుచుండెను. లోకమున నెవ్వరి కెక్కడను బిడ్డలు లేరా? 'పిట్టకొద్ది కూత

జూచెను. ఇట్టి రాజు చెంత నెవఁడు బ్రదుకఁగలఁడు. ఇట్టివానిఁ గొల్చుట కంటె కీఁడు మఱొక్కటున్నదే? క్రూరుండేలు వీట నెంత కూళ యైన నిలువనేర్చునే? లోకమున సామాన్యముగా నుపకారమునకే అపకార మొనర్చుచుందురు. పెద్దలు దుర్మార్గునితో స్నేహము కన్న సజ్జనునితో వైరము సర్వవిధముల మేలని చెప్పుదురు. కాబట్టి ఉన్నవిషయముఁ జెప్పితిని; మీరును యోచించి భావికార్య నిర్వహణ మెట్లులో చెప్పెదరుగాక! నా దృఢ నిశ్చయము మాత్రము వినుఁడు. బాలమల్లిదేవాదులకు నేనే మంత్రిగా నుండి అగ్రరాజ్యమునకుఁ బట్టముగట్టి వారు నివసింప నొక్కపురము నిర్మించెదను.' రేపే పయనము. వచ్చువారు రావచ్చును.'' అనియెను. అది విని యెల్లవారలు వినయంబునఁ జేతులుమోడ్చి 'దేవా! నిన్నెడబాసి యున్న నిముసము మాకొక్క యుగమగును. రాముఁడు లేని అయోధ్యవలె మాపాలిటి పెన్నిధానమైన నీవు లేకున్న నీవీట మే మెట్లు బ్రదుకఁ గలవారము. మేముగూడ నీవెంట వత్తుము. మా సర్వస్వము నీ యధీనము. పాలముంచినను నీట ముంచినను నీవే మాగతి. మమ్మగ్గి నుఱుకమన్న నుఱుకుదుము.'' అని తొంబదితొమ్మిది గ్రామములవారు వీరధైర్యముతో నేకగ్రీవముగా బలికిరి. నాయుఁడు వారి భక్తి కెంతయు సంతసించి సిద్ధముగ నుండుఁ డని ఆనతిచ్చి సభఁ జాలించెను.

మఱునాఁడు ప్రాతఃకాలమున తమ తమ కులోచిత వస్తు సంభారములతోఁ బ్రజ లందఱును పెండ్లికిఁ బోవునట్లు వెడలి మాచెర్లలో నాగులేటిదరిఁ జంద్రవంక తీరమున విడి

సిరి. అది యావాసయోగ్యముగ నాయఁడు గ్రహించి అచ్చటఁ బటకుటీరములను, చలువపందిరులను, ఆకుజొంపముల నల రారు శాలల నతి రమణీయముగ నిర్మించి పురమొంకు గల్పిం చెను. “జనులారా! ఈ రాజ వీధులలో మన చెన్న కేశవుఁ డీనాఁడు కనకవర్షముఁ గురియించును. దొరకినవారు దొరకి నట్లుగాఁ జేకొనుఁడు” అని రాజవీధులఁ జాటబంచెను. అదే విధముగ నాఁటినిశీధి వేల్పులు నాయని వాక్యముల వ్యర్థపఱుపక హిరణ్య వర్షమును గురిపించిరి. ప్రజ లందఱును సంతసించిరి. దివ్య సౌధముల నేర్పాటు గావించుకొనిరి. నాయఁడు శ్రీ చెన్నకేశ్వరస్వామి దయకు లోలోన మురిసియుచు స్వామి నందుఁ బ్రతిష్ఠించి కోవెల నొక్కదానిని మనోహరముగఁ గట్టించెను. చుట్టును హిరణ్య ప్రాకారములచే నలంకరించి మాచెర్ల యను నామ మా గ్రామమున కిడెను. నేఁటికి నిది సుప్రశస్తమై వెలయుచున్నది. ఆ దేవళమునకు సమీపముననే కన్నమనీఁడును ఒక్క సౌధమును నిర్మించుకొని సేనానాయకుఁడై నాయని కనుసన్నలో మెలఁగుచుండెను. బ్రహ్మన్నయు బాలమల్లిదేవాదుల కర్ధరాజ్య మిచ్చి మంత్రిపదవి నలంకరించి స్వేచ్ఛగా రాజ్యము నేలుచుండెను.

---

౭

ఆనందమతీంద్రియము. సుఖమింద్రియవేద్యము. ఒక్కొక్క యింద్రియము తృప్తి నొందునప్పుడు మిగిలిన యింద్రియములకు సుఖము గలుగదు. అందుచే దాని నానంద మనుటకు వీలులేదు. సర్వేంద్రియ తర్పణ మానంద మనఁబడును. ఆనందము లౌకికానంద మనియు, బ్రహ్మానంద మనియు ద్వివిధము. లోకవిషయముల వలన గలుగు ఆనందము సావధికము. ఈశ్వర సాక్షాత్కారమున జనించునది నిరవధికము. సావధికమైనను సర్వేంద్రియ సంతర్పణము పుత్త్రదారముఖదర్శనాదుల వలన లభించును. అట్టిదానినే లౌకికానంద మందురు. 'అపుత్త్రస్య గతిర్నాస్తి' అన్నట్లు సంతానహీనున కిహపరానందముల గొఱఁత. చిన్నిబిడ్డల చిఱునగవుల భాగ్యము గలుగనివారి జన్మములు వ్యర్థములుగదా? సంపద లుండిన నేమి? పేరు ప్రతిష్ఠలు గన్ననేమి? పసిబిడ్డల తప్పటడుగులచేఁ బవిత్రము గానివాని ఆలయము మహాలయము. వాని జీవనము నిరర్థకము. సంతానమును సురధేనువని శాస్త్రములు వక్కాణించుచున్నవి. అందుకనియే మానులును సంతానమును గని పితౄణమును దీర్చికొని ముక్తిమార్గమును బట్టిరి. ఆ కొదువ తీర్పరానిది.

ఐతాంబయు బ్రహ్మనాయఁడును సంతానమునకై వాపోవుచుండిరి. రాజ్య ముండిన నేమి లాభము? యోగ ముండవలెఁ గదా? రోజులు గడచుచున్నవి. దంపతు లిరువురు

నేకాంతమునఁ జేరినపు డెల్ల బిడ్డలకై వగచుటయే పని యయ్యెను. భగవంతుఁ డొసంగ వలసినదానికి మానవుని చేత లేమి పనికివచ్చును? శ్రీ చెన్నుని అనుగ్రహ మున్నచోఁ బిల్ల లకుఁ గొదువ యే మని నాయఁడు దన అన్నునకుఁ జెప్పుచు నూరార్చుచుండెను సాధారణముగాఁ బురుషులకుండు చిత్త స్థైర్యము స్త్రీల కుండదనుటలో వింత లేదు. ఐతమ్మ లోలోన భగవానుని ధ్యానించుచుఁ బుత్త్రమోహమునఁ గుందుచుం డెను. ఒక్కనాఁడు తోడికోడం డ్రందఱు తమ అత్తయగు శీలాంబ పజ్జఁ జేరి నమస్కరించి "అత్తా! నీ పుత్త్రుల యను గ్రహమునను, భవదీయాశీర్వాద ఫలమున నెంతయో సుఖ పడుచుంటిమి. కాని నీకు మనుమలను గనలేని మా యభాగ్య తకుఁ దలవంపు లగుచున్నది అమ్మా! మీ రేతీరునఁ దనూ జులఁ గని పెంచితిరో మాకు నాయుపాయ ముపదేశింపుము. మా సంతాపము మాన్ప నీకన్న నింక దిక్కెవరు?" అని పలుమాఱు లావేదనఁ బలుకసాగిరి. శీలాంబయు వెడనవ్వు నవ్వి "మానినులారా! దీనికింత విచారపడ నేల? మన గజనిమ్మ వనములోఁ గల జంబీర వృక్షమునకు నీరు వోసి అభిషేక మొనర్పుఁడు. శ్రీ చెన్నుని బూజింపుఁడు. ఇట్లు కొంత కాలము భక్తితో నొనర్పవా వృక్షరాజ మిగురొత్తును. అట్లా భూరు హము పల్లవితము గానిచో మీకు సంతానభాగ్యము లేదను కొండు. ఇగిర్చినచో ఫలవంత మగును. ఆ ఫలముల నారగిం చిన శ్రీ చెన్నకేశవుఁడే మన యింట నుద్భవించును. త్రికరణ

శుద్ధిగ నా వ్రతము నాచరించినవారి కిహ పర లోకముల నే కొదువయు లేదు.'' అని పల్కెను.

అంత వారెల్లరును సంతసించి వెంటనే ఆతోటలో నెండిన నిమ్మచెట్టు క్రిందఁ బరిశుభ్రము గావించి రంగవల్లులఁ దీర్చిరి. అంతట యథాశక్తి ద్విజబృందముతో శ్రీ చెన్నుని మనంబునఁ దలంచుచు షోడశోపచారములఁ బూజ లొనర్చు చుండిరి. గ్రహచారము బాగుగ నున్నపు డన్నియుఁ గలిసి వచ్చును. కొంతకాలమున కా నిమ్మ మొఱడు చిగురొత్తెను. ఉవిదల హృదయములు చిగురొత్తెను. కొన్నాళ్ళ కా తరురాజము పుష్పపల్లవ ఫల భరితమై శోభిల్లు చుండెను. ఆ ఐమన రాండ్రును మనము లలరి ఒక్కనాఁడు చెన్నకేశవస్వామినిఁ బూజించువేళ నా నూతనోద్యాన ప్రసవ మొండు శ్రీచెన్నుని పై నుంచి ధ్యానించు చుండిరి. ధ్యాన నిమగ్నయగు ఐతాంబ దోయిఁట నాసుమరాజము దొఱఁగెను. దాని కామెయు సంతసించి తోడికోడండ్రకును దాని నొసఁగి ధన్యులమైతి మని వెడలిపోయిరి. ఆ విషయ మెఱిఁగి ఊరివారు నట్లే పూజలు సేయ మొదలిడిరి. ఒక్కనాఁడు ఐతాంబ పెంచు భూరుహమున ముచ్చటగ మూఁడు పండ్లు పండి యుండెను. తోడికోడండ్రు మువురా ఫలములఁ గొని శ్రీ చెన్నుని మస్తకద్వయిని రెండును, శిరముపై నొక్కటియు నుంచి ప్రార్థించు చుండిరి. శ్రీశుఁడును వారలకు విముఖుఁ డగుచుండెను. ఐతాంబ మాత్రము చెన్నుని దిక్కు చూచి "ప్రభూ! దీనులపైఁ గరుణఁజూపవా? మాఱుమొగంబు వెట్టెద వేల? శరణాగత

రక్షకుఁడ వన్న బిరుదము వ్యర్థముఁ జేసికొందువా? మా మొఱాలింపవా? పరమాత్మా! రక్షింపుము; రక్షింపుము. లేకున్న నీప్రోలనే ప్రాణములను విడుతుము" అని దీనముగ వేడుకొను చుండెను. ఆ దైత్యమర్దనుఁడును వారల భక్తికి మెచ్చి వరమనుగ్రహించె నన్నట్లు లైతాంబ కా కరకమలము లందుఁ దన శిరముపైఁ గల ఫలమును జార్చెను. దాని నామె భక్తితో గ్రహించి కన్నులకద్దికొని భాగములుగాఁజేసి తోడి కోడండ్ర కీయఁబోయెను. వారును వాని నసూయతో నెల్లక "పక్షపాతముతో భగవంతుఁడు నీ కొసఁగిన ఫల మది మా కేల" నని విసర్జించిరి. తరువాత లైతాంబ తన వెంటఁ గల యితర కులాంగనల కాఫలభాగములనొసఁగెను. వారును విన యముతో స్వీకరించి శ్రీ చెన్నునిఁ దలఁచుచు భుజించిరి. కొన్నాళ్లకు లైతాంబికకు నెలదప్పి గర్భచిహ్న మగుపడెను. క్రమముగ నవమాసములు నిండెను. ఒక్కసుమూర్తమున తేజోనిధి యగు పుత్త్రరత్న ముదయించెను. ఉదయించిన వెంటనే వసు మతి వడఁకెను. దిక్కులదరిపడెను. సూర్యకాంతి మాసెను. నాయనికీవార్త దెలిసెను. మౌహూర్తికుల రాఁబనిచి "బిడ్డని జాతకచర్యఁ దెలుపు"మని ప్రార్థించెను. ఒక్కరును మాటాడరైరి. సభ సద్దు మణఁగెను. నాయకురాలి పంపున రహస్య వేషమున వచ్చిన వృద్ధ బ్రాహ్మణుడుమాత్ర మేదియో మాట్లాడఁ దలచుకొనెను. ఇంతలో నాయఁడు "ఆర్యులారా! మోమోటము వలదు. ఉన్నదున్నట్లు చెప్పుఁడు. సందేహము వల" దనియెను. వెంటనే ఆ లైతన బ్రాహ్మణుఁడు లేచి

"అయ్యా! నేను బహుకాలమునాఁటి వాడను. నాపేరు చెన్నుదీక్షితుఁడు. అనేక సంస్థానములలో రాచబిడ్డల జాతకములు చెప్పినవాఁడను. అందొక్కటియుఁ దప్పిపోలేదు. ఈ బాలునిజన్మవృత్తాంతముఁగూడ జెప్పెదను. కోపగింపకుండుఁడు గాత" యనియెను. నాయఁడదివిని "ఆర్యా! సత్యమును జెప్పినఁ గోపమెందులకు? నాకదియే కావలసినది" అనెను. అంతట విప్రుఁడు "అయ్యా! ఈబాలుఁడు పుట్టుకతో నంగవికలుడయ్యేనేని హానిలేకుండెడిదే. అట్లుగాదు పెక్కు గండములు గానవచ్చుచున్నవి. (వ్రేళ్లలెక్కఁబెట్టుకొనుచు)మంత్రిసత్తమా! ఈతఁడే కావలెనన్న నీ బంధుమిత్ర భృత్యహితుల నెల్ల రణభూమికి బలియిమ్ము. వారల రక్షింపఁ దలంచేని యీ బాలుని నీ కరవాలమున ... చేయుఁడు. ఈతనికిఁ బదునాల్గవయేట గొప్ప గండముగలదు ఈతఁడు భూమిపైనుండిన జనులెల్లరు నాశనమగుదురు. ఇంక పెక్కులేల! ఉన్నవిషయమిది. ఇటుపై నేలినవారి చిత్త"మని కూరుచుండెను. అంత నాయఁడు వెఱఁగంది యిట్టియనర్థములనుఁ గారణుఁడొక్కఁడు లేమి లోకములన్నియు సురక్షితములై యుండునుగదా? పుత్రమోహమున నేఁడీబాలుని ఉపేక్షించితినేని లోకద్రోహమొనర్చినవాఁడ నగుదు" నని స్వామినకు స్వస్తిఁజెప్పెను. పిదప బాలునిఁ బరీక్షింపనెంచి సభకు రాఁబనిచి ఒక్కచో ఫలముల నుంచెను. ఐదువ లాబాలుని వానిపైకి వదలిరి. బాలుఁడు కత్తినందెను. నాయఁడును దానికిఖిన్నుఁడై కన్నమదాసుని బిలిచి "ఓయీ! ఈ బాలుని మందసమునం దుంచి

నిశీథమున సాగరమున వదలిర''మ్మని ఆజ్ఞాపించెను. అతఁడు వల్లెయని బాలునిగొనిపోవునప్పు డైతాంబ మూర్ఛపడియెను. ఐతాంబ సోదరుఁడు కన్నమనీఁడుమాత్రము నాయని నేమియు ననలేక లోలోనఁ జింతించుచుఁ జెల్లెలి నూదార్చుచుండెను. మేనల్లుఁడు పుట్టినన్న సంతోషమే లేకుండెను. చెలికత్తియ లైతాంబ నూదార్చుచుండిరి. కన్నమదాసు పేటికను బుచ్చుకొని చీరాల సమీపమునఁగల సముద్రపుటొడ్డును జేరఁబోవుచుండెను. త్రోవలో నరసింగపాడు, నకరికల్లు మధ్యకు వచ్చుసరికి పేటికలోని బిడ్డ కదలకుండెను. దాని కాతఁడు ముప్పడి బాలుఁ డిందే మృతినందెనని యెంచి పేటికఁ దెఱచి చూచి రోదింప నారంభించెను. వెంటనే సమీపభూముల నిన్నిక్షీరములనార్జించి తెచ్చి ఆ బిడ్డయాకలిఁ దీర్చెను. శిశువుదుర్గతికిఁ జింతించుచు'' ఓ చెన్నరాయా! ఎంతటి పాపాలముద్దగా నన్ను సృజించితివి? పరమక్రూరుఁడను. నిన్నుఁబూజించిన నాయని కిట్టి ఫలమా ఒసంగుట? బిడ్డనీయకున్న నొక్కటే చింత అయ్యెడినికదా? నీచేఁత లత్యద్భుతములు. నడుమ నాకు గండకత్తెర వచ్చినదే? బుద్ధిపూర్వకముగా నిండు ప్రాణమును వార్ధి నెట్లుముంతును? ప్రభునానతి యెట్లు తప్పించుకొందును? హారా! నాబాధ పగవానికైనను వలదు. ఎంత అపకీర్తికి పాల్పడుచుంటిని. కానిమ్ము. విధికృతమునుదప్పింప నెవరి వశము? అని ఆ నడురేయి చింతించి చింతించి ఆ యడవిలోఁ బోవుచుండెను.

చందవ్రోలును సమీపించు నప్పటికి ఖడ్గహస్తుఁడై పేర్నీఁ డెదురుపడెను. 'అరరేయి నీ యరణ్యమున శోకించువారెవ్వ' రని కేక వేసెను. దానికా కన్నమదా సూరకుండెను. పేర్నీఁ డాతనినిఁ జీఁకటిలో గుర్తింపఁ జాలక 'ఎవ్వఁడో నిశాచరుఁ' డని జంకక వాని యురమున ఖడ్గముతోఁ బొడిచెను. కన్నమదాసా దెబ్బఁ దప్పించుకొని ఉగ్రుఁడై తన యుత్తమాంగము పైఁగల పేటికను దింపి కఠోర కుఠారమున నవ్వీరుని పైకి దుమికెను. ఇరువురును ఘోరముగఁ గొంత తడవు భీమ కీచకుల పగిదిఁ బోరిరి. తుదకు పేర్నీని భుజబలము నమసి భీమ గర్జనముతో 'ఎవ్వఁడవురా నీవు?' అని గర్జించెను. కన్నమదాసా ఎలుంగు విని సత్యమును గుర్తించి 'నేనుకన్నమదాసుఁడను. మీ దాసుఁడను. తెలియక చేసిన అజ్ఞానమును క్షమింపుమని మ్రొక్కినఁ బేర్నీఁడు వానిని లేవనెత్తి ఓదార్చి సర్వమును దెలిసికొనెను. బాలునిఁ జూచి మనసులోఁ గించపడఁ దొడఁగెను. దాసుఁ డదిచూచి "అధిపా! ఇంతలో నేమయ్యెను? వీనితో బ్రాహ్మణస్త్రీ మొదలగువారైతాంబనాశ్రయించి చెన్నని ప్రసాదమునఁ బుత్త్రులంగనిరి. వారును మీ యన్న బ్రహ్మనాయని యానతిపై ఏరండక్షేత్రమున విడువఁబడిరి. దైవ ఘటన మెట్టికార్యము లొనరింపదు!" అని కన్నీరు విడిచి తల వాల్చి ఆతఁడు నేలఁ గూలెను. పేర్నీఁడు పెట్టెలోని చిన్నిబిడ్డను జూచి

"పుడమి సమస్త జంతువులు బుట్టగఁ దొడనె పుట్టు మృత్యు వీ
యెడఁ గసి గందు వీని సమయించినఁ దప్పునె వారి గండముల్

జడమతు లైన బాలవధ సల్పుదురే ? మన కెన్నినాళ్ళు ని
ల్కడ గలదింక రేపనెడు కాలము గల్గునె మర్త్యకోటికిఁ ?"

ఓయీ ! కన్నమదాసా ! నాప్రతిజ్ఞవినుము. కాలజ్ఞని వాక్యముల యథార్థము గానిమ్ము. మిన్ను విఱిగి మీఁద వడనిమ్ము. ఆఱు మూఁడు గానిమ్ము. ఏది యెట్టులయినను యీ బాలుని నే మలుపువాఁడ. ఇంక నీవు రహస్యముగఁ జని ఆ మిగిలిన బాలురనుగూడ గొనిరమ్ము. వీరిని పోషించు భారము నాయది. నాయనికి మాత్రము తెలియనీకుఁడు. పొమ్ము"అని వానినిఁ బంపి, బాలుని గైకొని ముద్దాడి తనభార్య గౌరాంబ కొసఁగెను. దాసును తృటికాలములో నార్వురు బిడ్డలను మాచెర్ల నుండి యిచ్చటికిఁ జేర్చెను. పేర్నీఁడును వారినిఁ బూర్వమువలెభార్యకొసఁగి 'నారువ్రాయువాఁడెనీరువ్రాయును పోషింపు' మని చెప్పెను. ఆమెయు నాయేడ్వుర నొక్క రీతిగ సాకుచు ముచ్చటచ్చటలతోఁ బ్రొద్దుబుచ్చుచుండెను. ధీరస్వాంతుఁడై పేర్నీఁడు బాలసప్తకమును విద్యాబుద్ధుల, సాము గరిడీల సాధనలఁ జేయించుచు మురిపెముతోఁ గాలము బుచ్చుచుండెను.



చెందవ్రోలునఁ బేర్నీఁడు నిండు పేరోలగమ్మున నుండెను.
బ్రహ్మనాయఁడును, కన్నమనీఁడును చుట్టము మార్గముగా దారపుత్త్రాదులతో నచ్చటి కేతెంచి సభాభవనమున నెల్లరు జేరియుండిరి. కూతురు మాంచాల, తండ్రి కన్నమనీని యంకము నధిష్ఠించి యుండ బావమఱఁదులు సరస సల్లాపములాడుకొనుచుండిరి. ప్రసంగవశమునఁ గన్నమనీఁడు పేర్నితో 'బావా! నీ కోడలికి మంచి వరు నొక్కని జూడవయ్యా! మన శీలము వారియింట నొక చక్కనయ్య ఉన్నచో నాకీ బెడద లేకపోయెడిదే. నాజన్మము సార్థకము గాకపోయెఁగదా! అని వందురు చుండెను. పేర్నిఁ డది విని యెల్లరు విన — 'భావుకా! నీవిప్పుడాడిన మాటలు సమయము వచ్చిన మఱవవుగదా। ఆలోచించుకొనుము. నవ్వాటాలకని త్రోసిపుచ్చెదవేమో స్థైర్య ముండిన మాఱాడుము. లేదేని సభకు దోసిలొగ్గు మనియెను. దాని కాతఁడు 'బావా అనుట ఒకటి - అగుట ఒకటియునా! నావంటి వీరవరుఁడు బొల్లు లాడునే? మనకీ బ్రహ్మనాయఁడే సాక్షి. బాలకుఁ డుండినఁ జూపుము. తప్పక యీబిడ్డ నిచ్చి పరిణయము గావింతు' నని పల్కెను. పేర్నిఁడును నవ్వుచుఁ గన్నమదాసును గనుసైగఁ జేసి 'ఓయీ! మన ఉద్యానవనములోని విప్రార్భకుఁ డనపోతురాజును, వెలమశిశువు దోరన్నయును, స్వర్ణకారార్భకుఁడు వీరుఁడును, కులాలపుత్త్రుఁడు ధర్మ్మఁడును, రజకుని సుతుఁడు చంపన్నయు,

నాపకుని కుమారుఁడు మంచన్నయు, బాలచంద్రునితో నాటలాడుకొనుచుండిరి. వేగమ వారి నిటకుఁ బిలుచుకొని రమ్ము" అని చెప్పెను. వెంటనే ఆతఁ డట్లొనరించెను. బాలుఁడును రాజచిహ్నములు దాలుకాడ సభ కేతెంచి, విప్రులకును, ఉర్వీశులకును నమస్కరించి పినతండ్రి యంకతలము నధిష్ఠించెను. సభికు లెల్ల రాతని అందచందములఁ గాంచి ఆనందపడసాగిరి. కొందఱు నాయుఁడు సత్యసంధుఁడు; అకలంకుఁడును గదా! నేఁడీ వైపరీత్య మేమని ముక్కుపై వ్రేలిడుకొనిరి. పెఱవారలు గండమునఁ బుట్టిన బాలుఁడుండఁ గూడ దనియు, ప్రజాక్షేమమునకై పుత్త్రుని మున్నీట విడువఁ బంచినట్లు నాయఁడు జాటించెనే? మరల నేఁడీ వింత యే' మని కలకలఁ బడసాగిరి.

ఈ మాయా నాటకమెల్లఁ గన్నులారఁ జూచుచుఁ జెవులార వినుచున్న బ్రహ్మనాయఁడు కుపితుఁడై కన్నమదాసును జూచి పండ్లు పటపటఁ గొఱికి, కనుఁగొలఁకుల నిప్పుకలు రాల హుమ్మని హుంకరించుచుఁ గరవాలముఁ బెఱికి 'ఓరీ కృతఘ్నుఁడా! బాలునిఁగూర్చి నేనేమిచెప్పితిని? నీవేమి చేసితివి? ఈతఁడెట్లు బ్రదికెను? నిజమెఱిఁగింపు" మనెను. దాసుఁడు గజగజ వణఁకుచు స్వామీ! నేనేపాప మెఱుఁగను. మీరు చెప్పి నట్లొనరించితిని. బాలునిఁ గొని నే నీప్రాంత కాంతార భూముల నడచుచుండఁ గొంతదవ్వు రా నీతండు నిర్జీవుఁడుగఁ దోచెను. అంత నేను బాలుఁడు మృతిఁ బొందెనని ఒక్కచోఁ బారవైచి వచ్చితిని. పేర్నీఁడు వానినిఁదెచ్చి

పెంచెం గాcబోలును. అని నమస్కరింపుచు విన్నవించెను. నాయcడు మరల 'నీయూర్వుర నధింపు'మని కఠినముగ శాసించెను. కన్నమదాసు బాలచంద్రు నెత్తుకొని సంగడీంద్రతో బయలు వెడలి పురమున కనతిదూరముగcబోయెను. అచ్చట 'సర్వేశ్వర చట్టు' అను ఒక విశాలమైలాతలమును జూచి అందమర్పcబడిన ఉరికంబము దరి జేర్చెను. పౌరులెల్లరును బాలుcడిక బ్రతుకcడని వాపోవుచుండిరి. నాయcడు మాత్రము కఠినముగనే శాసించుచుండెను అందఱును 'దైవమా! ఎంత కొడిగట్టుచుంటివోయీ! ఈ బాలునెట్లైన రక్షించు భారము నీదె అని యీశ్వరునిc బ్రార్థింపుచుండిరి. బాలచంద్రుcడా హంతకులcజూచి "ఓయీ! మీరేల వ్యసన పడియెదరు? మా పిత్రాజ్ఞను మీరు నేఱవేర్చుcడు. అట్లుగాకున్న ఆ పాపము మిమ్ముc జుట్టుకొనును. లోకమున పుట్టుట గిట్టుట కొఱకే. నే నేనాcడైనను జావవలసినదే కదా! రాజాజ్ఞపై ననువులc గోల్పోయిన నైహికాముష్మిక లాభమందును." అని వచించెను. పిదపc తోడి బాలురును 'మా యన్నకు శిక్షను విధించుటకుc బూర్వము మమ్మందఱ నొక్కసారిగc గత్తికి బలియొసర్పుcడు. సిద్ధముగ నున్నా' మనిరి. ఆ పల్కుల కెంతయు భటులు వగనొంది గత్యంతర మారయక బాలునిc బట్టి శూలమునcగొఱత వేసిరి. అది భిన్నమై నేల కొఱcగెను. వజ్రదేహము నొవ్వcజేయ నెవ్వరి తరము? వెంటనే ఆయుధములతోc బొడిచిరి. అవియు మొక్కవోయెను. సూనరులు వెఱగంది ఆ వృత్తాం

తను నంతయు నాయనికిఁ దెల్పిరి. బ్రహ్మన్నయు నిట్టూర్పు విడిచి విచారించి చేయుటకేమియుఁ దోఁచక మొదలకుండెను.

అంతటఁ బెద్దన్న మొదలగు పెద్దలందఱొక్కచోఁ గూడి నాయని నీ యుద్యమమునుండి విరమింపఁ జేసిరి. దైవ విధి యెట్లుగానున్న నట్లే అగును గాని ఎవరి గండము లెవరినిఁ జంపఁ జాలవు. ప్రతిజీవికిని బుట్టునప్పుడు బ్రహ్మదేవుఁ డాయువును, కర్మయు, విత్తమును. విద్యయు, నిధనమును గూర్చి లిఖించియే యుంచును. ఇందఱ నొక్కమాఱు మడియు మని వ్రాసి యుంచునా? అట్లు వ్రాసి యుండినఁ దప్పఁద్రోయుట మన తరమా? ఇట్టిదారుణకృత్యమున కొడిఁ గట్టుట మనబోటి విజ్ఞులకుఁ దగ దనుచు బాలుర నెల్లర సభకుఁ గొనిరమ్మని భటుల కాజ్ఞాపించిరి. దానికి నాయఁడు మౌన మూనెను. దాను నతిత్వరితగతి బాలుర నచ్చటికిఁ గొనివచ్చెను. బాలచంద్రుఁడు యథాపూర్వముగఁ బినతండ్రి యంకతలము నధివసించెను.

పేర్నిఁడు సభలోఁ గన్నమ నాయనిఁ జూచి 'బావా! మీవంశజు లాడినమాటఁ దప్పరుగదా! సత్యసంధులుగోయీ! నాఁడు పలువురి సమక్షమునఁ బల్కిన బాస నేఁడు చెల్లింప వలెను. బాలునకు మాంచాల నిచ్చెదవో - లేక ఆడినమాట దప్పెదవో అని మోమోటబఱచు చుండెను. కన్నమనాయఁడు — 'బావా! ఇట్టి కఠిన గండములు గలిగిన వానికిఁ బిల్ల నిచ్చు టెట్లు? ఆడినమాటఁ దప్పు టెట్లు? చూడఁ జూడ నా స్థితి ముందు బోయిన నూయి వెనుక కడుగువెట్ట గోయియు

నన్నట్లయ్యో' నని విచారించుచు — 'భావుకా! నాతనయను నీ కుమారునకిచ్చి వివాహము గావించుట యథార్థమే. అన్న మాటఁ దప్పువాఁడను గాను కాని బండెడు ధనమును ఉంకువగా నీయవలయును. అది నీవాలోచించుకొను' మనియెను.

బ్రహ్మనాయఁ డిది విని 'ఓయీ! ఇదియా నీ కోరిక. బొక్కసమును జూపి వీనికిఁ గావలసినన్ని నిష్కముల నిచ్చి వివాహము గావింపు' మని పేర్మినికిఁ గనుసైగఁ జేసెను. ఆతఁ డట్లే యొనరించి దైవజ్ఞుల రావించి సుముహూర్తమున మాంచాలకును - బాలచంద్రునికిని జగన్మోహనముగఁ బెండిలిఁ గావించెను.

ఆ దంపతు లిరువురు పార్వతీ పరమేశ్వరుల వలెను, అరుంధతీ వసిష్ఠుల పోల్కి, లక్ష్మీనారాయణులట్లు మిక్కిలి శోభతో నలరారిరి. దేవతలు సుమవృష్టి గురియించిరి. వియ్యాలవా రొండొరులు 'భాయి భాయి' అయిరి. మాచెర్లఁజేరి సుఖముండిరి.



౬

సంక్రాంతి పండుగరోజులని ముత్తైదువ లందఱు వేకువనే తమ గృహాంగణములను రంగవల్లులఁ దీర్చు చుండిరి. బాలికలందఱుఁ జలికి లెక్క సేయక గుమిఁగూడి గొబ్బిపాటలు బాడుచుండిరి. సాతానిజయ్యరులు పంగనామములదిద్ది, తంబుర మీటుచుఁ జలుతాళముల లయఁ దప్పకుండఁ బాడుచు నడుగులు వేయుచుండిరి. చిన్నబిడ్డ లెల్లరు ధాన్యములపాత్రల నింపుకొని యెదురు జూచుచుండిరి. మగవారు ముఖమార్జనలు గావించుకొనుచు భిక్షుకుల పాటలకు లోలోన మురియుచుఁ దలలూపు చుండిరి. హాలికులు పంటచేలకుఁ బయన మైరి. బంతిపూలమ్ము ప్రూఁబోండ్లు పురవీథుల నడయాడు చుండిరి.

జాము ప్రొద్దెక్కినది. అందఱును శ్రీ చెన్నుని సేవ లొనరించి యిండ్లకుఁ జేరుచుండిరి. శీలాంబిక పరివారముతోఁ గట్టునూతఁగొని స్వామిని సందర్శించి గృహాంగణ మప్పుడే చేరెను. ఇంతలో నొక పాట వినవచ్చెను. అది చిరపరిచిత మైన స్వరముగాఁ దోఁచి అందే నిలువఁబడి వాని రాకకు నిరీక్షించు చుండెను. సాతాని యా గృహము లన్నియు దాటి అక్షయపాత్ర నవుదలఁ దాల్చి 'హరి రే రంగా హరి' అని వైష్ణవ భావ ముట్టిపడ శీలాంబిక నిలిచి యున్న వైపునకు వచ్చెను. వాని భాగ్యమేమోగాని ఆనాఁడు వాని అక్షయ పాత్ర నవరత్నములతో నిండిపోయెను. భజనఁ జేయుచు నటు నిటు దిరుగాడు వానిఁ జూచి శీలాంబిక 'ఏమిరా' ఎల్లఁడూ!

ఈ వేష మెన్నినాళ్లనుండిరా? నీవు ఏనుఁగుల ఎల్లఁడ వను కొంటను. నీది గురిజాల గాదురా? అంతదూరమునుండి యీ ముష్టి కెక్కడకు రావలెనా? విశేషము లేవైన గలవా? మీ రాజును, మంత్రిణియు, పౌరులును క్షేమముగ నున్నారా? మానాయనికిఁ గనుపడకుండ పొమ్ము'' అనెను. ఆమాట విని లోపల నొక్కచో నేదియో వ్రాసికొనుచున్న బ్రహ్మన్న అది విని బయటికి వచ్చి 'ఏమిరా! లోకమును మోసగింప నీ వేషమునుగూడ వేసితివా? గురిజాల రాజధాని నందఱు కుశలమేగదా? అని గద్దించి పలికెను. వాఁడును తన గుట్టు బయటఁ బడిన దన్నట్లు తత్తఱపడుచు 'పొట్టకూటికై బాబా యిన్ని వేషములును! తమ రెఱుఁగని దేమున్న' దని తల వంచుకొని నిమ్మళముగా దాటి బట్ట సాగెను. నాయఁడాతనిఁ బిలిచి 'ఓరీ! మీవారు నిన్ను వెతకి వేసార కుండఁగా మార్గమున నాపబండల గుంపున జారిపడకుండఁ బొమ్మ' అనియెను. వాఁడును నాయకురాలు చెప్పినదెల్ల మాంచెర్లఁ గలయఁ జూచి నాయని మాటల లెక్కబెట్టక గురిజాల దారి నడచు చుండెను. బ్రహ్మన్న వాక్కు బ్రహ్మవాక్కు గదా! ఏనుఁగుల ఎల్లడును ద్రోవలో నొక బండపై జారిపడి లేవ లేక పోయెను. వాని తమ్ముఁ డెల్లఁ డెంతకును రాఁడని అన్న కెదురు సని పడియున్నచోటును జూచి లేవనెత్తి విషయమెల్ల గ్రహించి — 'అన్నా! మగుడ బ్రహ్మనాయని దర్శించి శరణుఁ జొచ్చి సత్తము. లే' అని నాయని యొద్ద కేగెను. ఆతఁడును 'ఏమిరా ఎల్లా! మరల వచ్చితివి? విశేషములేమి?

అనెను. వాఁడును మ్రొక్కి 'మహాత్మా! మీ యాజ్ఞ లేకయే నే నీ పురిఁ గాలిడినందులకుఁ దగిన శిక్ష జరిగినది. క్షమింప వలయు' ననెను. 'దానికేమి. కాలము దప్పిన నెంతవారి కైనను కష్టములు వచ్చుచుండును ఇంక నీకు భయములేదు. సుఖముగా పొమ్ము' అని నాయఁ డన్నదమ్ముల నిరువుర గురిజాల కంపెను.

మఱునాఁ డుదయమున నాయకురాలు రాజమందిరమున నొంటరిగ గూర్చున్న సమయమునం దెల్లఁడు వెళ్ళి ఆమెకు మ్రొక్కి మ్రోల నిలువఁబడెను. వానినిఁ జూచి, —

నాయ:— ఓరీ! ఎప్పుడు వచ్చితివి? విశేషము లేమి? చెప్పిన పని నెఱవేర్చి వచ్చితివా? ఇట గూర్చుండుము.

ఎల్ల:— తల్లి! తమ యాజ్ఞ మీఱుటయా? గడచి రేయికే వచ్చితిని. మాచెర్ల వైభము సురలోకమును ధిక్కరించు చున్నదమ్మ. ఆ సింహద్వారములు, ఆ రత్న ఖచితకవాటములు, ఆపద్మరాగ శోభిత ప్రాసాదములు, ఆ మాణిక్యదీపములు — ఒక్కటేల? అన్నియుఁ జూచియే తీరవలెను. ఎన్ని యని వర్ణింతును?

నాయ:— అటు పైసంగతి...?

ఎల్ల:— అమ్మా! ఆపుర వైభవ మట్లుండనిమ్ము. 'కొట్టాల మిట్ట' యని మఱియొక స్థలము గలదు. అచ్చట కన్నమ నాయని సౌధమును జూచితిని. వహ్వా! ఏమని చెప్పుదును? వేనోళ్లు గల ఆదిశేషున కైన వర్ణింప నలవి గాదు. — అని విస్మయపడుచుండెను.

నాయ:- ఎల్లఁడా! అది సరియే కాని బ్రహ్మనాయఁడు మనపైఁ గ్రోధాగ్నినిఁ బేర్చుచుండెనా? అసలు విషయము జెప్పవేమి?

ఎల్ల:- అది నే నెట్లు చెప్పఁగలను తల్లీ! శీలాంబిక మాత్రము మీ క్షేమమును రాజుగారి క్షేమమును ఎత్తిపొడుపుగ నడిగెను. నేనును తెలియని వానివలె నటించితిని.

నాయ:- ఓరీ! ఈమాత్రము విచారింప లేకపోయితివా! అగుఁగాక. బ్రహ్మనాయఁడు మనల నవమానపఱచినది నీకును దెలియునుగా? అట్టివారి నిప్పుడు వంచించు టెట్లో చక్కనిఉపాయ మొక్కదానిని ఆలోచింపుము.

ఎల్ల:- మహారాణీ! దీని కింత విచార మేల? చోరులఁ బంపి దోపిడిఁ జేయించిన మాచెర్ల వైభవము కన్నుమూసి తెఱచు నంతలో మాయ మగును. ఇంతకన్న వేఱు మార్గము నా కగుపించుట లేదు. ఆలస్యము చేసిన కార్యమున కంతరాయము గల్గు ననుకొనియెదను.

నాయ:- బలే చక్కని యెత్తు నెత్తితివిరా! ఏమి చతురత — అని వాని కొక రత్నాల హారము నిచ్చి పంపివేసెను.

వెంటనే ఆమె నల్లమలఁగల నాలుగువేల సైన్యమును, ఎఱ్ఱమలఁ గల యేడువేల నుక్కు బంట్లను కౌరవసైన్యము బగిది మాచెర్ల పట్టణమును దోపిడిఁ జేయఁబంపెను. వారును సాయుధపాణులై చంద్రవంక దరి నందందుఁ దిరుగు చుండిరి. బ్రహ్మనాయఁడా సమయమున శ్రీచెన్నకేశవుని ధ్యానించుచు

నాగులేటి దరినిఁ జూచి విషయము నంతను గ్రహించెను. నాయకురాలి దుర్మనీష లోలోన వెగడొందుచు నింటికిఁ జేరెను. కన్నమదాసు త్రోవలో నాయని కెదురుపడి వెంట నరుగుదెంచెను. బ్రహ్మన్న దాసుతో నాయకురాలి పన్నాగ మంతయుఁ దెలిపి 'దోపిడిగాండ్రకుఁ దగినశిక్ష విధింపు' మని ఆజ్ఞాపించెను. తత్క్షణమే మంత్రి యానతి నౌదలఁ దాల్చి ఆ దుండగీండ్రపైకుఱికి కన్నమదాసు, అందుఁ గొందఱు క్షతగాత్రులను, కొందఱి వినాశమును గావించి, ప్రళయకాల రుద్రునివలె వారినిఁ బట్టుకొనెను. దొంగ లాశిక్షను సహింపలేక నాయకురాలి కుట్రను వెళ్లఁగ్రక్కిరి. దానికాతఁడు మండిపడి 'కుక్క కాటుకు చెప్పుదెబ్బ' వలె - మాచెర్ల ద్రవ్యమని యితరులనుకొను నట్లు చంద్రవంకలోని యిసుకను గోనియలకెత్తించి వారి వీఁపులపై నుంచి స్వయముగాఁ దోలుకొని తాను తెల్లవారు సరికి గురిజాల రాజధానికిఁ జేరెను. నాయకురాలు కోట దిడ్డివాకిట నిలిచి చోరుల రాకఁ జూచినంతనే ఆమె తన రొట్టె విఱిగి నేతిలోఁబడ్డ దన్న ట్లువ్విళ్లూరు చుండెను. భటులెల్లరును సమీపించు చుండిరి. వెనుక కన్నమదాసు కృపాణ బాణపాణియై రెండవ యముని వలెఁ బ్రత్యక్ష మయ్యెను. నాయకురాలి గుండెలో రాయి పడియెను. ఉపాయములువిడల కేమి కొదువ? పైకిమాత్ర మతిధైర్యముతో నామె దాసునిఁ జూచి 'ఓరీ! దూరముగాఁ బొమ్ము. పోకుంటివా నీ ప్రాణము లూడ దీయించెద' నని అఱచెను. అది విని కన్నమ

దాసు రౌద్రమూర్తియై 'ఓసీ రాక్షసీ! కడజాతివాఁడ నని హాస్యముగఁ బల్కుచుంటివి. చూఁడు నా పరాక్రమము.

"నాయు నాజ్ఞలేక నాతిన్నిఁ జంపంగ
విహిత మగునె యనుచు విడిచినాఁడ
నెందుఁబోయె దింక — హింసింతుఁ జూడు నీ
కైశ్యమైనఁ గోసి కాని విడువ"—

అనుచు వెనుదవిలి గోష్ఠద్వారము వరకు తఱిమెను. నాయకురా లంత మేకపోతు గాంభీర్యముతో గజగజ వణఁకుచు "ఓరీ! పొగరుబోతూ! నీ నోటి పులికంపనైతినే"— అని గొణిగికొని మెల్లన రాజమందిరము ప్రవేశించెను.

మాచెర్లలో బ్రహ్మనాయుఁడు గన్నమదాసును గూర్చి విచారించుచు, నీ పిల్లపిడు గేమయ్యెనో యని చింతించుచు శత్రువుల వలన అపాయము గలుగకుండుటయే పదివేలను కొనుచు వీరావేశమున హితులతో బయల్వెడలి గురిజాల రాజధానికిఁ జేరెను. అంతకు మున్నె బ్రహ్మనాయని రాక గుర్తెఱిఁగి రాజసింహాసన ప్రాంతమున గోతినిఁ ద్రవ్వించి జీర్ణకాష్ఠముల నాచ్ఛాదన మొనర్చి లోపలఁ గత్తుల నిమిడ్చి పైన రత్నకంబళములఁ బఱపించెను మాయలాడి మనసును మహాత్ములైనఁ గనలేరు; కాని బ్రహ్మనాయఁ డాకుతంత్రమును బసిపట్టెను. హితులతో నాత్రోవన నడచుచు వారలఁ బ్రక్కకు నడువు మనుచుఁ దా నూపిరి బిగఁబట్టి ప్రాణాయామ పాటవమున నొవ్వకుండ సభఁజేరెను. నలగాముఁడును

బ్రహ్మన్నయు నిష్టాగోష్ఠితోఁ గాలము బుచ్చిరి. అంద
ఱును నాఁటిరేయి భోజనమునకై యొక్కచోఁ జేరిరి. నాయకు
రాలు బ్రహ్మనాయనిపైఁ బ్రేమ కలదాని వలె దధి క్షీరముల
విషముంచి సూపకారులచేఁ బోయించెను. అతఁడును తెలి
సియుఁ దెలియనట్లు నటించి ఆ విషలిప్తాహారమును భుజించి
హరించు కొనియెను. 'దుష్కరం కిం మహాత్మనా' యను
నార్యోక్తి పొల్లగునా ? తరువాత బ్రహ్మనాయఁడు కన్నమ
దాసుతో నా రాత్రి గడపి ఉదయముననే బయలుదేరి క్షేమ
ముగ మాచెర్లకుఁ జేరెను. నాయకురాలు తాను జేసిన పను
లన్నియు వ్యర్థమగుటకు లోలోనఁ బరితపించుచు విసమును
హరించుకొన్న బ్రహ్మన్న మహోదారతకు నెద నివ్వెఱఁ
బడుచుండెను.

---

## ౧౦

దుర్మార్గులు సత్పురుషుల కకారణ శత్రువులు. సాధారణముగఁ బ్రపంచములో నుపకారము జేసినవారికే అపకారము జేయుట ప్రసిద్ధము. సజ్జనులు ఫల మపేక్షింపకయే పరోపకారము జేయుచుందురు. అది వారి నైజగుణము. అట్లే దుష్టుఁడు నొరుల కపకారమును జేయుటయే ప్రధాన కార్యముగ నెంచుకొనును. అది వానికి స్వాభావికము. మేఘుఁడు జీవనమొసఁగు నప్పుడు ఫలమేమి కోరుచుండెను ? పామును కఱువు మని యెవరు బోధించిరి? ఎవరి నైజగుణము వారిది. భగవంతుని సృష్టిరహస్య మియ్యదియే !

బ్రహ్మనాయఁడు పినమల్లి దేవాదులతో మాచెర్ల పట్టణమున సుఖముగ రాజ్యము నేలుచుండెను. అది విని గురిజాల రాజుకడ మంత్రిణి నాయకురాలు కడుపుకట్టుఁ బట్టలేకుండెను. ఆమె నైజగుణమది. ఈగ మధురపదార్థమున్నను వ్రణమునే వాంఛించుపగది నీచులు కలహమునే గోరుచుందురు. నాయకురాలు నలగామరాజు నఱచేతిలోఁ బెట్టుకొని యెన్ని ఆటలో ఆడుచుండెను. అవియెల్ల రాజునకుఁ బ్రీతిగనే యుండెను. మనసు గలసినవారికి మంచిచెడ్డ లొక్కటియేగదా! నాయనిపై లేనిపోని అపనింద లెన్నియో ఆమె కల్పించుచునే ఉండెను. అవి యివి అననేల ? గ్రామములోఁ గోడి పందెములలోఁగాని, పొట్టేళ్ల పందెములలోఁగాని తనకు జోక్యము లేకపోయినను గల్పించుకొని అచ్చటికేగి ఓడినది నాయని

పేరుతో, గెల్చినది తనపేరుతోఁ బిలుచుచుఁ గేలి సేయుచుం డెను. ఊరిలోనివారందఱును 'తంధానతాన' అనుచు నాయకు రాలి వైపే పలుకుచుండిరి. బలవంతునిదిగదా రాజ్యము!

ఇట్లు కొంతకాలము గడచెను. కర్ణాకర్ణిగా నీ విషయ మెల్ల బ్రహ్మన్న చెవి సోఁకెను. అతఁడును పరమ శాంత ముతోఁ జాలకాల మాచియాచి చూచుచుండెను. నాయకు రాలి దుస్తంత్రములు మితిమీఱుచుండెను. అది విని సహింప లేక నాయఁ డొక్కనాఁ డేదో పనిబట్టి రాజధానికి వచ్చి నలగామరాజుతో ముచ్చటించుచు నీ ప్రసంగమును దెచ్చెను. అతఁడు వినియు విననట్లూరకుండెను. పిదప రాజును, మం త్రియు సాయంకాల విహారమునకై ఒక విశాలప్రదేశమునకు మాటలాడుకొనుచుఁబోయిరి. అచ్చట జనులందఱు గుమిగూడి యుండిరి. వారా కలకలమేమో తెలిసికొన నుండిరి. అంతలో 'బ్రహ్మన్న ఓడెను — నాయకురాలు గెల్చెను' అను కేకలు వినఁబడెను. తరువాత నాయకురాలు పట్టరాని ఆనందముతోఁ జప్పట్లుఁ జఱచుచు నా పందెములో నోడిన కోడినిఁ జూచి 'నాయఁడా! మాచెర్ల వైభవమునెల్ల వీడి రాజచిహ్నములు మాని పగవారు దఱుమ పాఱిపోవుచుంటివా? ఆహాహా! ఏమి నీ పౌరుషము' అని బొబ్బలిడుచుండెను. అది చూచి నాయఁడు మహోగ్రుఁడై ఆమెను సమీపించి 'ఏదీ చార్వాకీ! ఇంకొక సారిట్లు ప్రేలుము నీ నాలుకఁగోయింతు' ననియెను. వెంటనే ఆ కుటిలభామిని రోషముట్టిపడ 'ఓయీ బ్రహ్మన్నా! ఇంక నీ సామర్థ్యమేల? మగువకోడిన మగవాఁ

డవు. నీవునొక మానిసివని పల్కుచుంటివా? ఒక్కసారేమి - లక్షసార్లు ప్రేలెదను. నాల్క గోయింతువా? కోయింతువు గానిలే... ఇదిగో నీ కోడి ఓడినది '' అని పకపక నవ్వుచు హేళనఁ గావించెను. నాయఁడా అవమానమును భరింపలేక తన యనుచరుఁడగు కన్నమదాసు నోరగంట సైగఁ జేసెను. దాసును దానిని గ్రహించి తన కులదైవతములకు మ్రొక్కలిడి మరల నా కోడిపందెముల వేసి చిటుకలో ముందు జయమొందిన కుక్కుటములనెల్లఁ జంపించెను. నాయనిదే పై చేయి అయ్యెను. నాయకురాలు సిగ్గుతోఁ దలవంచుకొని పోవుచుండఁ గన్నమ దా సామెను జూచి '' ఓసీ విశ్వస్తా! పెద్దలు పిన్నలనక మహాత్ముఁడగు మంత్రినే అల్పునిగ భావించి అపహాస్యమాడితివి. నీ కండకావర మణఁగినదా? ఇంక నేమి చేసెదవ్వో చేసికొనుము. చేతనైన మఱొక పందెము వేయుము. పాఱిపోవుట పౌరుషము గాద '' ని విదళించెను.

'పాఱిపోవుట గాదు. మరలఁ బందెము వేయవలెననియే నాయకురాలిమాత్రమునకే ఓడుననుకుంటివా? కూళా! పాఱిపోవుట మీబోటి పౌరుష హీనులకు గాని మగువులకు మర్యాద గాదని యెఱుగవు గాఁబోలు' అని నాయకురాలు చుఱచుఱ నాయనిఁ జూచుచుఁ గన్నమకు బదులు జెప్పెను. నాయఁడప్పుడు 'ఓసోసీ వాచాటీ! అంతగా వాగకుము. వ్యవహారమింకను జరుగవలయునా? అట్లైన నీకుఁ గావలసినంత గడువు దీసికొనుము. నాఁడే పందెమునకు సిద్ధముగనుండె

దము. అని కనుబొమ ముడితోఁ బల్కి అటనుండి గదలి వైళమ తమ ఆవాసముల కేగెను.

ఒక్కనాఁడు బ్రహ్మనాయఁ డేకాంతముగ శ్రీ చెన్న కేశ్వరుని ధ్యానించు చుండెను. కన్నమ దాసు కట్టిన గడప నెల్లఁ జూచి ఎచ్చటను తాఁ బ్రమచూడ మొక్కటేని గానక నాయని కెట్లు సమాధానము జెప్పుదునా యని చింతంపుచుఁ దలవంచుకొని కొలువుఁగోనికిఁ బ్రవేశించెను. అచ్చట పెద్ద న్నయు మఱికొందఱు వీరులును గలిసి నాయకురాలి కుచేష్టలనే జెప్పుకొను చుండిరి. పెద్దన్న, కన్నమదాసు నాకృతిఁ జూచి— "ఓరీ! మొగ మెఱ్ఱబారి నట్లున్నది కారణ మేమి?" అని అడిగెను. ఆతఁడును జరిగిన దంతయు విన్నవించి "చిన్న దొర యెచ్చట బాబయ్యా?" అనెను. వెంటనే పెద్దన్నయు నాతుర తతో బయలుదేఱి అచ్చటి వారెల్లరితో నుద్యానవనమున నున్న బ్రహ్మన్న కడకుఁ బోయెను. ఆ సవ్వడి విని నాయఁడు దఱిని గూర్చుండ నియమించి దాసును జూచి యిట్లనెను.

బ్రహ్మ:— ఓయీ! మన పని నెంతవరకు నిర్వహించి వచ్చితివి?

దాసు:— ప్రభూ! పల్లెలను పట్టణములను గాలించి వచ్చితిని.

బ్రహ్మ:- ఒక్కటియైన లేదా?

దాసు:— లేకేమి? నాయకురాలు నలువైపులకు భటుల నంపి ఊరూర నింట నింటఁ గల చరణాయుధము లెన్ని యున్న నన్నిటిని రెట్టింపు వెలకుఁ గొనివచ్చి ఒక మహా

వరణమునఁ జేర్చి శత్రువాతఁ బడకుండ నీరు మేఁతలు బెట్టి రక్షించుచుండెను. గురిజాలయంతయుఁ గుక్కుటమయ మయ్యెను. ఇంక మన కొక్క కోడియైన లభించుట దుర్లభము.

బ్రహ్మ:– (పెద్దన్నను జూచి) ఓయీ! మనకు నాయకురాలితోఁ గూడి పందెము తప్పునట్లు లేదు. ఆమె అంతయు సిద్ధ మొనర్చుచునే యున్నది. మఱచితిని 'దాసూ! పందె మెప్పుడని నిర్ణయించెనో? జాడ నేమైనఁ దీసితి వా?

దాసు:– ఆ...దొరా! తెలిసికొంటిని. రేపుగాని మఱునాఁడు గాని జరుగు నని గురిజాల యంతయు 'అట్టుడికినట్లు డికి పోవుచున్నది. ఇంతలో రాజధానినుండి భటుఁ డొక్కడు వచ్చి తన చేత నున్న కమ్మ నొకదానిని నాయని కందఁ జేసెను. నాయఁడు దానిని విప్పిచూచి అందఱు విన –

గురిజాల,

కార్తిక బ ౧౪ లు

మంగళవారము.

మహారాజ రాజశ్రీ ... ... బ్రహ్మనాయనికి,

మహా మంత్రిణి నాగాంబికవ్రాయు విశేషములు:–

వీరాగ్రేసరా!

రేపు రాఁబోవు మార్గశిర శు 3 లు శుక్రవారమున పూర్వము గురిజాల రాజధానిలో మనము నిర్ణయించుకొన్న పణానుసారముగ కోడి పందెము వేయుటకు నిశ్చయింపఁ బడినది. రంగస్థలము:- అల్లురాజుచేఁ బ్రతిష్ఠింపఁబడిన గంగాధర మడుఁగు దరిని శ్రీ చెన్నకేశ్వరాలయము నెదుట. ఆతఁడే యిరువాగుల వారికిని సాక్షి. నాఁటికి మీమీ సాధనములతో నటకు రావలయును. తప్పిన ఓడినట్లే.

ఇట్లు,
నాయకురాలు.

అని చదివెను. అచ్చటివారెల్ల త్రుళ్ళిపడి "ఆఁడువార ప్రతీకార పారుష్యము గలవారన్న నుడి సరిపోయినది. పందెపు గడువు డగ్గఱించుచున్నది. ఎట్టులా" అని నివ్వెఱఁబడుచుండిరి. అంతలోఁ—

పెద్ద:- తమ్ముఁడా! పూర్వము పానుగంటికడ శనైశ్చరుని చట్టులో నొక్క బిలమున మహిమగల పుంజొక్కటి గలదు. దాని ప్రతిభ వర్ణనాతీతము. అది సిద్ధించిన మన కార్యము కొనసాగగలదు.

బ్రహ్మ:- అది మనకెట్లు సంప్రాప్తమగును? క్షణములోఁ గొనిరావలయునన్న మనకన్నమ ......?

పెద్ద:- కాదు కాదు. ఆ కుక్కుట మమానుషచర్య గలది. పూర్వ మది కార్తికేయుని ధ్వజమఁట. శాపకారణ

ముగ నిందు జన్మించెను. శ్రీ చెన్నుని కరుణ గల్గినచో లభ్యమగునేమోగాని లేమన్న......

బ్రహ్మ:- అట్లయిన మనలో నింక సమర్థులెవ్వరు?

పెద్ద:- ఎవ్వరున్నారు? శ్రీ చెన్నుఁ డెవరిని నియమించునో యోచింపుము అని పల్కెను.

బ్రహ్మన్న వెంటనే కన్నమదాసు తన్ననుగమింప శ్రీ చెన్నకేశ్వరాలయమున కరిగి అచ్చటఁగల తరుచ్ఛాయను పద్మాసనాసీనుఁడై ముహూర్తకాల మతిభక్తితో భగవంతుని ధ్యానించెను. మహాత్ముల భక్తి ప్రపత్తులు ప్రశంస్యములుగదా! అంతఁ గొంతవడికి నడగొండవలె భూమి బ్రద్దలై అజ కిశోరమును జంక నిడికొని, భుజమునఁ బరశువు నూని ములుగత్తి నుచ్చ్వెముల దోపి, ఒడిసెల నడుమునను బిగఁజుట్టి, బరిగమ్మ చేతవట్టి కిఱ్ఱుచెప్పుల మ్రోతతోఁ బదఘట్టనముల ధరణి నుగ్గునూచగ రాయుచు, నొక్క వీరపురుషుఁడు ప్రత్యక్షమై బ్రహ్మనాయని అడుగుఁ దమ్ములకు నమస్కరించెను. నాయఁడు దుష్కార్థ మానసుఁడై కనులు విప్పెను. అంత నా నూత్న పురుషుఁడు 'స్వామీ! నా పేరు వీరరాయ పరాలుఁ డందురు. శ్రీ చెన్నకేశవు నానతి నీకు వచ్చితిని. ఏమి సెల' వనెను. దానికి నాయఁ 'డోయీ! పానగల్లు చెంత నున్న చట్టులోని కుక్కుటరాజమును దీసికొని రావలయును. ఒరుల కది అసాధ్యము' - అని పల్కెను. అందుల కాతఁడు 'మహాత్మా! చిత్తము. ఆజ్ఞ శిరసావహించెదను.

ఒక్క చిటుకెలో దాని నిటకుఁ దెత్తును. కరుణించు ' మని నమస్కరించెను. నాయఁ డాతని దీవించి ద్విజిహ్వాభియుక్త మగు భుజంగసదృశ శేషువు నొక్క దాని నొసఁగి పంపెను. ఆవీరరాయఁడును మనోవేగముగఁ బయనము సాగించుచుండ నొక్కచోఁ గొందఱు బాలురు పశువులఁ గాచుచుండిరి. వారినిఁ జూచి రాయ 'ఓ బాలకులారా! పానగల్లు పల్లెకు దారి యేది? ' అని అడిగెను. వారును మిడిసిపాటుతో 'నీ వెవ్వరవు ? పట్టణమును పల్లె యందు వేమి ? అట్లు వాదించు నిన్ను ముందుగ శిక్షించి ఆపైని త్రోవఁ జూపుదు ' మనిరి. అంతల నాతఁడు కోపగించి – అందఱ నొక్కమాటు చంక నిడుకొని నల్లుల నలిపినట్లు నలిపి శిక్షించెను. వారును 'బ్రతికితిమిరా బాబూ ' అని గ్రామములోనికిఁ బరువెత్తి రాయని దుండగములఁ బౌరులకుఁ గోరంతలు గొండంతలుగఁ జేసి చెప్పిరి. వారిలో నొక పౌరుఁడు దూలాల పోతురెడ్డి గర్వించి రాయని రాక కెదురు సని ధిక్కరించెను. మాటపై మాటఁ బెరుగ నిద్దఱును కదనమునకు సంసిద్ధులైరి. అందు రాయని దే గెలుపయ్యెను. పిదపఁ బోతురెడ్డి రాయనికి లోబడి తోడయ్యెను. ఇరువురును గలిసి నిరంకుశముగఁ బట్టణమునఁ బ్రవేశించి చట్రాతి యందు మూసిన ముత్తైమై యున్న ఆ దేవకుక్కటమును గొనివచ్చి నాయని కిచ్చి మెచ్చుఁ గనెను.

బ్రహ్మనాయఁడును, పెద్దన్నయును, గన్నమనీఁడును, గన్నమదాసును మొదలగు వీరు లందఱును చెన్నుని కృప కచ్చెరువునందుచు వీరపతాలునిఁ బొగడి కోడిపోరున కాయత్త

మైరి. మఱునాఁడే పందెము వేయవలసిన దినము. నాయని పక్షమువా రందఱు తహతహలాడుచు నాయనితోఁ బందెమును గూర్చి ఆలోచనము సాగించిరి. ఇంతలో దైవయోగంబున బాలగోపన్న యను నతఁడది యెఱిఁగి తల్లినాసతి నతిశీఘ్రముగ నచ్చటికి వచ్చెను. బ్రహ్మన్న గోపన్నకుగల కోడిపందెపు నేర్పెఱిఁగిన వాఁడగుటవలన ఆతనిఁ జూచి 'ఓయీ! ఎల్లి జరుగఁబోవు కుక్కుటసంగరమున జయమును గూర్పవలసిన భారము నీ యదియే. ముందుగ మన మేమి చేయవలయునో చెప్పుము. సిద్ధపఱచుకొందము'' అనియెను అప్పుడు గోపన్న నమస్కరించి 'మహానుభావా! పోరునకు ముందరి నైపులవారేదేని పన్నిదమునిర్ణయించుకొనవలెను. నిర్ణయించు సమయమున నచ్చటఁగల నదిలో స్నానమాడి ధౌతవస్త్రధారులై శ్రీమహావిష్ణునకు మ్రొక్కి చుట్టును మూఁగి కూర్చుండవలయును. అట్టియెడ కుక్కుట మెవరిఁ జేరి నిలుచునో వారే పందెము బెట్ట నగ్గలు తక్కినవా రూరక తొలఁగియుండవలయునని చెప్పి కావలసిన సాధనములెల్ల సమకూర్తు'నని వెడలిపోయెను. బ్రహ్మన్న ఒక వేగరితో మఱునాటి తమరాకను నాయకురాలికిఁ దెలియఁ బంపి యింటికేగెను.

అట గురిజాలలో నాయకురాలు తగిన సన్నాహములతో సిద్ధపడి తనజయమునంతను ముప్వాల భీమన్న మూఁపుపైఁ బెట్టి ఉత్సాహపడుచుండెను. భీమన్న కోడిపందెములో మొనగాఁడు. ఆతనినిఁ గూర్చి అంతగాఁ బొగడిన నతిశయోక్తి

అందురు గాని నిజముగా భారతములోని శకునివంటి మాయల మారి. వాని పెంపుడుకోడికి 'చివ్వాల బెబ్బులి' అని ముద్దు పేరు బెట్టుకొనెను. అది నిజముగ నా పేరునకుఁ దగినదే. వాఁడు దానినిఁ జంకనిడుకొని నాయకురాలి కుబ్బిపోవునట్లు ప్రగల్భములాడుచు ఆనందపడుచు గంతులువేయుచు నంద ఐకోఁ గార్యమపూడికిఁ బ్రయాణ మయ్యెను.

మంచెర్లనుంచి బ్రహ్మనాయని పక్షమువారు కార్యమపూడిలోఁ గాలు బెట్టిరి. రెండు పక్షములవారును కదన భూమికిఁ జేరిరి. చుట్టుపట్ల పౌరులెల్ల రుత్సాహముతో నిసుక వేసిన రాలకుండ చుట్టును జేరిరి. కలకల శబ్దము దిగంతము లావరించెను. ఏమి జరుగునో యని ప్రజ లువ్విళ్లూరుచు నటునిటు త్రొక్కుడు వడుచుండిరి. అంతలో నాయని పక్షము నుండి గోపన్న లేచి రంగస్థలమున నిలిచి — 'ప్రజలారా! సద్దుచేయ వలదు. పందెము జరుగును. దానికి ముం దుభయ పక్షములవారును షరతు లేర్పాటు గావించుకొన వలయునని హెచ్చరించి, ప్రతిపక్షులవైపు మరలి — నాగసానీ! ఇందు పందెపు షరతుల నిందఱ యెదుట నిర్ణయించవలెను. ఇచ్చట నీ ఆటలు సాగవు. వీరపురుషులతో, వీరపురుషులే పందెము వేయవలెను. నీ పక్షమున నట్టి వీరపురుషులున్న ముందునకుఁ బంపు' మని గట్టిగ నొక్కి చెప్పెను. దానికి నాయకురాలొడఁబడి లోలోనఁ దన మంత్రమును దాను సాగించుచు మున్వాల భీముని ముందుకంపెను. ఆతఁడును కోడినిఁ జంక

నిడికొని నాయకురాలి ఆనతిపై సభ్యులతో 'ఓ సభాసదులారా! పందెమునకు గల షరతులు వినుఁడు.

"ఈ కోడిపందెమున బ్రహ్మనాయుఁ డోడినఁ దన విభవమెల్ల వీడి ధన ధాన్య కనక వస్తు వాహనాదుల వదలి మణిమయ కేళికామందిరముల మాని పుత్రమిత్ర కళత్ర పరివృతుఁడై కృష్ణదాటి ఏడు సంవత్సరములవరకు వన్య జీవనముల నుండి తిరిగివచ్చి తన భూముల నేలవలయును.

ఇంక నాయకురా లోడినచో మంత్రిపదమును మాని అన్యాయము నణచిపెట్టి భగవంతునిఁ దలఁచుకొనుచుఁ గృష్ణ దాటి వన్యభూముల వసింపవలయు" ననెను.

దాని కిరువాగులవారును సరే అనిరి. పత్రములపై వ్రాసికొని సభికుల సమ్మతినిఁ బడసిరి. చూపఱులెల్లరు వింత ఫ్రొవ్వు చుండిరి. పందెగాండ్రు ముందంజ వేయుచుండిరి. సువ్వాల భీమన్న ముందుగా 'చిన్నబెబ్బులిని' అలంకరించి పందెమునకుఁ బెట్టెను. వెంటనే బాలగోపన్నయు బ్రహ్మనాయని అనుమతిపైఁ జెన్నునిఁ దలఁచి దన కృకవాకువు నెదిరి పందెమునకుఁ బనిచెను. రెండును తీంద్రముగఁ బోరు సాగించినవి. బాలగోపన్న పుంజు నాయకురాలిపుంజు నుండియుండి ఒక దెబ్బన మట్టు బెట్టెను. ఆమె మఱికొన్ని కోళ్ళను బందెము వెట్టెను. ఫలము లేకపోవుచుండెను. మనసు కొందల మంది విచారించి వాహనమెక్కి 'కట్టుపోతుల గంగవరము' జేరి అచ్చటి మాంత్రికులతో నాలోచించి తన కోటమి

లేకుండఁ జేయుఁడని కొంత పారితోషికము నిచ్చెను. వారును సంతసించి శాబరోక్త మంత్ర చాతుర్యమున నభిమంత్రించి మంత్రాక్షతల చరణాయుధములకుఁ గట్టి కలనికిఁ బంపుచుండిరి. అప్పటికిని గెలుపు బ్రహ్మన్నకే వచ్చుచుండెను. మాంత్రికు లది గ్రహించి ప్రతిబలములోని కుక్కుట నేత్ర బంధము గావించిరి. దానితో గోపన్న ఆటలోని కోడి కన్నులు మూసికొని పోయి పోరి పోరి బింక మెడలి మూర్ఛిల్లెను. నాయఁడు నిశ్చేష్టుఁడయ్యెను. నాయకురాలి మనసు పొంగి పోయెను. 'అన్యాయ మన్యాయ'మని ప్రజలు కేకలు బెట్టిరి. బాలగోపన్న నృశింహావతారుఁడై దుస్తంత్రములఁ వెలిసికొని మున్వాల భీమన్న నారంగమునకు బలి యొసఁగెను. తానును రణరంగమునఁ గూలెను. కోడియు వారిలోఁ గలిసెను. కన్నమ దాసీసంగతిని గ్రహించి గోపన్న శరీరావయవముల నెల్ల నేటి తెచ్చి బ్రహ్మనాయని ముందుంచెను. ఆతఁడును శ్రీ చెన్నునిదయ నాతనిఁ బునరుజ్జీవితునిఁ జేసెను. గోపన్నయు నిద్రనుండి లేచినట్లు లేచి నాయనిఁ గొనియాడెను. అందఱును బ్రహ్మన్న బ్రహ్మయే అని విస్మయపడిరి. తరువాత నాయఁడు తన పక్షమువారి నందఱఁ బిలిచి 'మన మోటు వడితిమి. సమయోల్లంఘన మొనరింపఁ గూడదు. సప్తసంవత్సరములుఁ బ్రతిజ్ఞా ప్రకారము ప్రవాసము జేసి మరలి రావలయు' నని అంతదనుక నగరమునఁ గల ధన ద్రవ్యములఁ గాపాడుటకు సమర్థు లెవ్వరని విచారించి గోపన్న నందులకు నియమించి మాచర్ల కనిపి మంగళవాద్యములతోఁ బరమోత్సాహమునఁ

దా నటనుండియే వన్యభూములకుఁ బయనమయ్యెను. అచ్చటి వారందఱును నాయని వీడఁ జాలక వెంటనంటిరి. కాని ఆతఁడును కొలఁది వీరులనే వెంటఁబెట్టుకొని పెండ్లికేగు నట్లేగుచు కృష్ణానది నేలేశ్వరపు రేవుగా దాటి, అటుపిమ్మట మూఁడు యోజనములు గడచి మందాడి యను గ్రామమును జేరెను. అచ్చట గోవులనుంచి వానికి రక్షణగ 'లంకన్న' యను వీరునిఁ గాఁపువెట్టి మూఁడు సంవత్సరములుందుండెను. నాగసాని వానిజాడ నెఱిఁగి బోయ చెంచుల నంపి గోవుల నపహరింపఁ బ్రోత్సహించెను. వారు నటకేగి విఫలమనోరథులగుటయేగాక కన్నమదాసుచేఁ జావుదెబ్బలు దిని పాఱిపోయిరి. నాయఁడది యెఱిఁగి 'మిత్రులారా! ఎంత దూరము వచ్చినను నాగసాని మనపాలిటి నాగుబామయ్యెను. రారాజు చరిత్ర మఱపు రాకున్నది.

" పోటు బడ్డచోట నాటి యుండఁగరాదు
పాటు పడ్డచోటఁ బ్రతుకఁ గీడు " అన్నట్లు,

మన మింక నిట నిల్వరాదు. ఎటకేనిఁ బోవుట మేలని చెప్పి శ్రీశైలక్షేత్రమున కరిగెను.



గృహ కృత్యముల నిమగ్నులై పాపపుణ్యము లనక ధన మార్జించి దార పుత్త్రాదులం దనుపుటయే మానవుల పని యయ్యెను. అట్టివారు తరించుటకు పుణ్యక్షేత్రములనియు, పుణ్యతీర్థము లనియు, స్నానము లనియు, పానము లనియు, దానము లనియు, ధర్మము లనియు నాదిమ ఋషు లేర్పాటు గావించిరి. ఇంతియే గాదు. మనశ్శాంతికై పండుగ లనియు, పబ్బములనియు గూడ నేర్పాటు గావించిరి. ప్రతి పండుగకు నేదో యొక పుణ్యక్షేత్రమున నుత్సవములు జరుగుటయు నటకు సంసారులు పోవుటయు గూడ జరుగుచుండును. అందును సుప్రసిద్ధాంధ్ర భూమిలోఁ బేరెన్నికఁగన్న పుణ్యక్షేత్రములు పెక్కులు గలవు. ముక్కోటికి శ్రీరంగము, శివరాత్రికి శ్రీశైలము, శ్రీరామ నవమికి భద్రాచలము మొదలగున వెన్నో పుణ్యస్థలములఁ జూచుచునే యున్నాము.

అవి మహాశివరాత్రి రోజులు. ప్రజలాబాలగోపాలము గుంపులు గుంపులుగ శ్రీమల్లికార్జునుని సేవకై అరుగుదెంచుచుండిరి. కొండబోయలు వారికిఁ గొలువు సేయుచుండిరి. యాతాయాత జనంబుల నాశ్రమ ప్రాంగణముల నిలుచుండి చూచుచు నలరా జచ్చెరు వొందసాగెను. నాయఁడు వానినిఁ జూచి – 'ఓయీ! ఏమి ఆశ్చర్యపడు చుంటివి? ఈ క్షేత్రము సామాన్య మనుకొంటివా? ఇది మహా దివ్యక్షేత్రము. దీన సార్థత్రికోటి తీర్థములుగలవు. అణిమాది సిద్ధుల కిది ఆటపట్టు.

మునిశ్రేష్ఠులకుఁ బుట్టినిల్లు. సర్వవేద్యాది ఓషధులకు జన్మ భూమి. స్నాన దాన మౌన తర్పణ ధరణములు గాని నెంచేని ముక్తి లభింపదు. ఇచ్చట నట్లు గాదు. శిఖర దర్శనముననే మోక్షము కరతలామలక మగును. దీని యుత్పత్తి అతిపవిత్రము.

తొల్లి శిలాదుఁ డను ముని కొమరుఁడు పర్వతుఁడను వాఁడు శివుని గూర్చి తపముఁ జేసి సిద్ధి వడసి 'ముల్లోకములఁ గల పుణ్యతీర్థములతో సుర సిద్ధ సాధ్య యక్ష గరుడ గంధర్వా ప్సరోగణములు గొలువ గౌరీసమేతుఁడవై నా శిఖరముపై వశింపు' మని వేడెను. శర్వుఁ డట్లే అధివసించెను. దాన నీ స్థలమునకు శ్రీ పర్వత మను పేరు వచ్చెను. ఇందే ఏటను మాఘ బహుళ చతుర్దశీలు శ్రీశుని యుత్సవములు జరుగు చుండును. దానినిఁ జూడ నెల్ల రుత్సుకత నరుదెంచుచుందురు. దీనినిఁ గూర్చి ప్రాచీను లొక్క యితిహాసమును గూడఁ జెప్పుదురు. పూర్వమీ ప్రాంతము చంద్రగుప్తుని పరిపాలన లోనిది. వాని కూతురు పరమ భక్తురాలై నిత్య మట నుండి ఉమామహేశుల మల్లికాదామముల నలంకరించి పూజించు చుండెడిదట. అందుచే నీ స్వామికి మల్లికార్జునుఁ డను నామ మొదవెను. కూతు సౌందర్యమును జూచి తండ్రి ఒకప్పుడు చలితాంతరంగుఁ డయ్యెనఁట. దాని కామె కినలి 'దురాత్మా! నీవొక బండవై పాతాళగంగఁ బడు మని శపించెను. వెంటనే అతఁ డొక పచ్చని బండయై అంటుంటెను. ఆమె శివైక్య మయ్యెను. ఇది దీని పూర్వ వృత్తాంత' – మని చెప్పెను.

అలరాజును తక్కిన వీరవరు లానందముతో మల్లికా ర్జునుని సేవించి నుతించి ధన్యులైరి. అంతట నాయఁడు సపరివారముగా త్రిపురాంతమున కేగి అందుఁ గల త్రిపుర సుందరేశ్వరులను సేవించి, మార్కాపురము మీఁదుగా శ్రీ చెన్నుని యనుగ్రహాముచే నందఱితో వీరమేడపిఁ జేరి బాల మల్లిదేవాదులకుఁ బ్రత్యేక సౌధముల నేర్పాటు గావించి సుఖముగఁ బరిశిష్టాబ్దముల గడిపిరి. ప్రవాసకాల మంతరిం చెను. నాయఁడు దనవారినిఁ జూచి "ఓ వీరవరులారా! మన వలసకాల మతిక్రమించినది. శ్రీకృష్ణుఁడు పాండవులకు సాయ పడిన రీతి శ్రీ చెన్నకేశ్వరుఁడు మనల నుద్ధరించెదును. ఇంక మన రాజ్యమును బడయుటకు నలగామరాజు నొద్దకు రాయ బారిగ మనలో నొక్కనిఁ బంపవలయును. దానికి సమర్థు లెవ్వరో చూడుఁ" డని హెచ్చరించెను. అందఱును 'మేము - మేము' - అని ముందంజ వేసిరి. నాయఁడు వారినిఁ జూచి 'అట్లు త్వరపడకుఁడు. రాయబారి అనిన నంత సులభుఁడు గాఁడు. సర్వజ్ఞుఁడును, దేశ కాల పాత్రవేదియు, పరేంగితజ్ఞుఁ డును, పక్షపాత రహితుఁడును, వినయవంతుఁడును, వివేకి యును, చతురమతియుగా నుండవలయును. ముందు నా అభి ప్రాయము వినుఁడు. నలగామరా జనుగుటల్లుఁడు మన యీ అలరా జట్టివాఁడు. ఉభయులకు జెప్పఁ దగినవాఁడు. బాంధ వుఁడును జగజెట్టికాఁడు నై యున్నవాఁడు. అతనిఁ బంపుట సర్వసమ్మత మనుకొనిమెదను. అందుల కెల్లరు నంగీకరిం తురా!' అని నుడివెను. వెంటనే అచ్చటివా రందఱు -

'సరే కానిండు' అని తల లూపిరి. అలరాజు తండ్రి యగు కొమ్మరాజున కీ విషయ మెఱుఁగఁ జెప్పి పంపెను. ఆతఁడును వైళమ జని భార్య యొద్ద నీ సంగతి నెఱుకపఱిచెను. కాని చెల్లాంబికా దేవి పుత్త్రప్రేమచేఁ గొమరునిఁ బంపుట కొల్లక కంటికి మంటికి నేకధారగా నేడ్చుచు వానినిఁ జూచి 'నాథా! ఆగ్రుల్లగంధర్వు నెదిరించిన పోటుమానిసి పెద్దన్న అటఁ లేఁడా? మాస్త్రీలను గూల్చిన పేర్మిఁ డేమయ్యెను? పానుగంటిని బాడొనర్చిన పతాలుఁ డేమయ్యెను? కన్నమనీఁడు కాలు గదపఁడా? నాయకురాలి సేనలు నలినలి గావించిన కన్నమ దాసుని ఔన్నత్య మెందు దాగెను? ఆరువదార్గురు వీరనాయ కులు, డెబ్బదిముగ్గురు పోటమన్నీలు నుండఁగాఁ గాకిపిల్ల కేమి తెలియునురా ఉండేలి దెబ్బ' అన్నట్లు పెద్దలచాటు వాఁ డీతఁడే మీచిత్తమున కెక్కువగఁ దోచెనా? చెల్లమ-చెల్లమ అని నన్నుఁ జెలియలిగాఁ జూచునాయని పేర్మియేమయ్యెను? బాలుని రాయబారమున కంపి నన్ను దుఃఖము పాలు సేయుట మీకు న్యాయమా? నాయకురాలి యొద్దః నుట తోడనే నాగుండెలు దడదడ లాడుచున్నవి. ఇం దెంతమాత్రము నాకిష్టము లే'దని చెప్పెను. కొమ్మరాజు నాయని కావార్తను తెలియపఱిచెను. నాయఁడది తెలిసికొని స్వయముగ నామెయొద్దకేగి "అమ్మా! నీవు వీరమాతవు. ఇట్టు లధైర్యమూనఁ దగునా? అతఁడు రణవిశారదుఁడు. భయ మేమియును లేదు. అంతటి యెత్తు వచ్చిన వాని ప్రాణమ్మునకు మాఱుగా నా ప్రాణ మొడ్డెద

నని తన కంఠమునం దున్న తులసి మాలను వాని యఱుతున వైచి – చెల్లీ! దీనిం దాల్చిన ప్రేతమైనం జైతన్యము నం దును చింతింప వల" దని చేయెత్తి చెప్పి ఆమెను సమ్మతింపం జేసెను. అలరాజు వస్త్రాభరణాలంకృతుండై పెద్ద లందఱకు నమస్కరించి తురంగారూఢుండై రాయబారిగా రాజధాని కేగెను

ఆనాఁడు నలగామరాజు నిండు కొలువున నుండెను. పరివారమంతయు నియమిత కృత్యములందు నిమగ్నులై యుం డిరి. రాజుగారి యల్లుని రాకకు పౌరులెల్ల విస్మయ పడిరి. సేవకబృందములు లోలోన గుసగుసలాడు చుండినవి. భూనా థుఁడు 'ప్రతిపక్షబలములో నల్లుఁడు చేరెనే' అను ఈసును గలిగి యుండెను. కాని లోకమర్యాద ననుసరించి గౌరవింపక తప్పినది కాదు. రత్నాల పేరమ్మ భర్త రాక విని మహానంద ముతోఁ జాటు చాటుగా నతని ఆకార ప్రకారములఁ బొడ గాంచు చుండెను. నలగామరాజు అల్లుని నుచితాసనాసీనునిఁ జేసి తేనె లుట్టిపడ నిట్లనెను.

నలగా:– అలరాజా! అందఱకును క్షేమమా?

అలరా:– ఆ! శ్రీచెన్నకేశ్వరుని దయవల్ల నందఱికిని క్షేమమే. మీ రెల్లరు నిండుఁ గుశలము గదా?

నల:– ఉంటిమి ... ఎటనుండి నీ రాక?

అల:– మామా! తమ రెఱుఁగని దేమి కలదు? వీరమేడపి నుండియే!

నలః– (తల యూఁపుచు ) అట్లయిన బాలమల్లి దేవాదులు నాయని ననుసరించి మెలఁగు చుండిరా ? ఇంకను విశేషము లేమి ?

అలః– విశేషము లేమున్నవి. బాలమల్లి దేవాదులు పెంచి పెద్దఁ జేసిన నీ కరుణాతిశయమునకుఁ గృతజ్ఞతఁ దెల్పిరి.

నలః– నాయని మంత్రిత్వ మేమయ్యెను ?

అలః– బాలమల్లి దేవాదులను దన మంత్రప్రభావమున రక్షించుచునే ఉండెను.

నలః– రక్షించుట కంత ఆపద యేమి కలిగెను ?

అలః– నరనాథా ! అట్లుగాదు. నాయకురాలితో నాటి కోడి పందెమున నీ అనుఁగుఁ దమ్ములోడి వన్యభూముల సంచరించుట నీ వెఱుఁగనిదా ?

నలః– ఎఱుఁగ కేమి – అది యట్లుంచుము వీరమేడపిలో సుఖముగనే కాలయాపనము జేయుచుండిరి గదా ?

అలః– కాలయాపనమున కేమి ? కందగడ్డలు భుజించి మును లరణ్యమున ముక్కు-మూసికొని బ్రదుకుట లేదా ?

నలః– అట్టి సుఖము లభించిన నింకఁ జెప్పెడి దేమి ?

అలః– అది ఐహిక భోగలాలసులకుఁ గాదు. రాజ్యకాంక్షులై ఉప్పు పులుసు కారము తిని ఈర్ష్యాళువులై ఉండువారికా ?

నల:- సరియే దాని నట్లుంచుము. ప్రస్తుతము నీ రాకకుఁగల కారణ మేమి?

అల:- మామా! గడువు దీఱినది కనుక బ్రహ్మనాయనికిని మీకును సంధిఁ గావింప రాయబారినై నీ యొద్దకు వచ్చితిని. నాయఁడు నారాయణాంశ సంభూతుఁడు. మానవమాత్రుఁడు గాఁడు. ఆతని మహిమ లనంత ములు. అవి సర్వు లెఱింగినవే. అయిన నెల్లర సమ్ముఖ మున మరల నొక్కసారి విన్నవించెదను. నాఁడు సూతికాకృత్యముఁ జేయ వచ్చిన మంత్రసాని దంతము లూడఁ దన్నెను. నాయకురాలు మాయచే నంపిన విషయుక్త దధి క్షీరములఁ ద్రావి జీవించెను. త్రికాల వేది యని ఎఱుఁగక మ్రొక్కఁగోరిన భూవిభునికి తన మహిమఁ జూపెను. శ్రీ చెన్నుని ప్రసన్నునిగాఁ జేసి కొనెను. ఇట్టివింకెన్నియో గలవు. నరనాథా! పెక్కు లేల? నీ తమ్ముల రాజ్యమును వారి కిచ్చి వారును నీవును నీరక్షీరముల భాతి సుఖింపుఁడు. వారును గడువు దీఱి సంధికి నన్నంపిరి. ఇంతవరకును నాగసాని బోధ తలకెక్కి అనుజుల నరయవైతివి. వారును నీకుఁ దలలోని నాల్కగా మెలఁగువారే. కుక్కతోఁకఁబట్టి గోదావరి నీద యత్నించునట్లు నాయకురాలి వలన నేమేమో సాధింపఁ జూచుచుంటివి. మీరు నాకు మామలు. మీ క్షేమము గోరి ఇరువురికిని సంధాయ కుఁడనై వచింపు చుంటిని. మామా! బాలుఁడ నని

తలచి నా యీ సందేశమును బెడచెవినిఁ బెట్టితివా యుద్ధము తప్పదు. నాలుక తీపులోన విషము పనికి రాదు. ఇంక నీ యిష్టము. దీప ముండగనే యిల్లు చక్కఁ బెట్టుకోఁ దగును. సంధి గాక నాయనితో యుద్ధమే అయ్యేనేని జరుగనున్నది జననాశనము. దీర్ఘ ముగ నాలోచించుకొనుము. పుణ్య పాపములు నీపైఁ బెట్టినాను. పెద్దన్న ప్రతాపశాలి యని మీరెరిఁగినదే. మల్లినీని మహిమ జగద్విదితము. ఇంక పేర్నీఁడు సూర్నీఁడును యోధానయోధులు. ప్రతాపవంతులెంద రెందఱో వారికి సాయము రానున్నారు కౌరవపాండవ యుద్ధ ఫలిత మేమయ్యెను? ఇది గూడ నంతియే. బాగుగ యోచించుకొనుము.

నల.— అల్లుఁడా! ఎంతటి దీర్ఘోపన్యాసము గావించితివోయీ! చాల శ్రమ పడితి వనుకొందును!

నాయ.— (ప్రక్కనుండి నవ్వుచు) ఔనౌను! ఇన్నిమంచి తీర్థ మిప్పింతునా?

అల:— నేఁడిచ్చట నేను శ్రమఁ దీర్చుకొనుటకు గాదు వచ్చినది. సంధి కుదురకున్ననాఁ డందఱు వీరశయ్యపై దీర్ఘముగ శ్రమ దీర్చుకోవలసి వచ్చునేమో అని......

నల:— (కోపమున లేచి) అలరాజా! ఇంక నీ ప్రతాపము వారల ప్రతాప మిక్కడ నేకరువు బెట్టకుము. మీ బలాబలము లే నెఱుఁగనివి గావు. నాయఁ డంత

మహాత్ముఁడే వైనచో నొక్క అబల కోటువడి సిరులెల్ల విడిచి కానలకుఁ బోవునా? ఈ పుక్కిటి పురాణములు నాకడనా? చాలించుము. అసంఖ్యాకము లగు సేనలు కన్ను మూసి తెఱచు నంతలోఁ గదలగలవు. ఎదిరి బలము నెఱుఁగక నీవారిని నీవు పొగడకుము. ఈ వృథాలాపముల కింకొక్కడైన నీపాటి కీ ఖడ్గధార కెర యగువాఁడే. అల్లుఁడ నగుటఁ బ్రదికితివి. ఇంకనైన దేహము గాపాడుకొని పొమ్ము.

అల:- (లేచి నిలువఁబడి మొగము గంటువెట్టుకొని) రాజా! చెప్ప వలసిన మాటలు చెప్పితిని. 'వినాశ కాలే విపరీత బుద్ధిః' అన్నట్లు నీ బుద్ధి పెడత్రోవ బట్టు చున్నది. యుద్ధము తప్పదు. అని వెడలిపోయెను.

వెంటనే చెర్లగుడిపాటిలోఁ దనతో వచ్చిన కన్నమ దాసును గలిసికొని యావద్వృత్తాంతమును దెల్పెను. ఈ విషయ మంతయు నాగసాని గనిపెట్టి వారిపైఁ బ్రీతి ఉన్నది వ్రాలె విషాన్నమును సూపకారులచేఁ జెర్లగుడిపాడునకుఁ బంపెను. వారును దానిఁ గొనిపోయి 'అయ్యా! తాము బంధువులరు; రాయబారులై వచ్చినవారలు; అందును రాజున కల్లుండ్రు. భుజింపకపోవుట పాడి గా దని యెంచి ఈ యోగిరమును బంపించిరి. చిత్తగింపవలయు' ననిరి. అది విని కన్నమ దాసు పగతుని యన్నము దినరాదని వారికి నచ్చఁ జెప్పెను. అంత నిరువు రేకమై నలగామునిపై దాడివెడల నుద్యుక్తు

లయిరి. కాని నాయని యాజ్ఞ లేమికిఁ జింతించి మిన్నకుండిరి. నాయకురా లది యెఱింగి విషచూర్ణోపేత మగు పుష్పములఁ గొన్ని శివ నిర్మాల్య మన్నట్లొక శివార్చకునిచే నలరాజున కంపెను. వాఁడును దేవతాప్రసాదము వలె వినయము నటించుచు నలరాజునకా పుష్పముల నందఁజేసెను. నిజముగ శివనిర్మాల్య మని యెంచి అలరాజు వాని నాఘ్రాణించి విసము తలకెక్క నేలఁ గూలెను. కన్నమ దాసునకు గుండె వగిలి ఏమియుఁ దోఁచక గురిజాల కేగి ఆ పూజారినిఁ బట్టి నుఱుమాడి గత్నాల పేరమ్మ కీవార్త తెలియఁ జేసెను. ఆమెయు శిరము నురము బాదుకొనుచు వెక్కివెక్కి యేడ్చి పరలోకగతుఁడైన భర్తను దీసికొనిపోయి తండ్రికిఁజూపి సంగతి నంతయుఁ దెల్పి కలుషించి 'తండ్రీ! నాయకురాలి దుర్బోధల కొంపడి నన్నీగతి యొనర్చితివి. నీ ప్రాణములు దీయుట కొక్క బాలచంద్రుఁడు జాలును. నీ బంధుమిత్ర పరివార మంతయు యుద్ధమున సమయును గాక! తూమెఁడు నల్లపూసలు రెండుతూముల గాజులు నీ యింట రాలు కాలము దాపురించిన' దని జాలి బుట్ట వలవల నేడ్చుచుండెను. కన్నమదాసు కత్తి దూసి పండ్లు గీటుచు నలగామునిపైకి దూకెను. అతఁడా వ్రేటును దప్పించుకొని పాఱిపోయెను. వెంటనే ఆ శవమును కన్నమదాసు, పేరమ్మ వీరమేడపికిఁ గొనిపోయి బ్రహ్మనాయని ముందుంచి రక్షింపఁ బ్రార్థించిరి. నాయఁడు పేరమ్మ నూరార్చుచుండెను. ఈ విచారకర వార్త కెల్లరు నచ్చటికి వచ్చిరి. ఆ వెన్క బాలచంద్రుఁడును ఆటకుఁ బఱువిడుచు

వచ్చెను. చెల్లాంబికయు గుండె గ్రుద్దుకొనుచు 'సోదారా! నేను మునుముందుగనే పంప వలదని ప్రార్థించితినే. వినవైతివి గదా! అయ్యో! నేఁడీపుత్రశోకము నాకెట్లుదీరును! రక్షింపవా? వనమాల మహిమ యే మయ్యెను?'' అని వాపోవుచుండెను. నాయఁడా శవమును బరికించి మెడలోఁ దానువైచిన హారము లేమికిఁ జింతించు చుండ బాలచంద్రుఁడా వనమాల! దన మెడలోనుండి తీసియిచ్చెను. బ్రహ్మనాయఁడు "ఓయీఁ ఇది నీ మెడలోని కెట్లు వచ్చెను?'' అని యడిగెను. బాలుఁడంత "తండ్రీ! అలరాజు రాయబారిగఁ బోవునపుడు నేనును వానివెంటఁ గొంత దవ్వతిగితిని. దారిలో నొక నది అడ్డు వచ్చెను. నే నాతనితో—' అలరాజా! నీ వాహనము గుఱ్ఱము. నా వాహనము పొట్టేలు. ఉభయులలో ముందెవ్వరీ నదిని దాటుదురో వారిలో నొకరు తన మెడలోని భూషణముల నన్నిటిని గెలుపుకాని కీయవలయు నంటిని. ఆ పందెములో నే గెలిచితిని. ఒడంబడికరీతి నలరాజు తన భూషణములతోఁ బాటు ఈ వనమాలను గూడ నా కిచ్చెను. అత్తవారింటికేగువానిని అలంకారశూన్యునిగఁ బంపఁగూడ దని యెంచి నే నాతనికిఁ గొన్ని భూషణములు మరల నొసఁగి పంపితిని. ఆ సమయమున నిది నా కంఠముననే ఉండిపోయెను. పిదప విచారించితిని. అయ్యో! ఎంత పని జరిగెను?'' అని చెప్పుటతోడనే నాయఁడు ముదమంది ఆ వనమాలను గైకొని అలరాజు మెడలో వైచెను. అలరాజు లబ్ధప్రాణుఁడై లేచి నాయనికి మ్రొక్కి 'మహాత్మా! నే నిహలోక సౌఖ్యముల

మాని శంకరు పజ్జఁ జేరితిని. అట్టి నన్నేల మరల బ్రతికింతువు? నా పూర్వస్థానమునకు నన్నుఁ బంపు" మని వేడనతఁ డట్లే చేసెను. రత్నాల పేరమ్మ భర్తతోఁగూడ సహగమన మొనర్చెను. నాయఁడు వారి నగ్ని సంస్కారములు గావించి ముక్తిసంపదఁ జేసెను.

మఱునాఁడు బ్రహ్మనాయఁడు వీరులనెల్ల రావించి ఉగ్రుఁడై 'వీరవరులారా! నలగామరాజు పల్కిన పుల్లవిఱుపు మాటలు వింటిరిగదా! సంధి కుదురదని స్పష్టమయ్యెను. నేటి కాతని యఱచేతికిఁ బండ్లు వచ్చినవి. ఇంత పిల్లిశీలము గలవాఁడని తెలిసిన నలరాజును పంపకయే ఉండువాడను. బాలుఁడని, బంధువని, రాయబారియని, తుద కల్లుఁడనిగూడ యెంచక మాట మీఱిన ఆతని నాలుక వేయి చీలికలు గావింపవలెను. ఎన్నాళ్ళీ అడుగులకు మడుగు లొత్తుట? మనలో నుడుకు రక్తము లేదా? బ్రదుకు మూనాళ్ళకాలమే. కీర్తి శాశ్వతము. రెండు నడుములు బిగించుడు. ఒక్క ఆఁడుది. అందును విశ్వస్త. ఆపె చెవులుబట్టి ఎట్లాడించిన నట్లాడు వెఱ్ఱిమొగమా మనకు రాజ్యభాగ మీయననుట! బాల మల్లిదేవులన్నఁ గత్తి నూఱుచుండెను. అలరాజును పొట్టఁ బెట్టికొనెను. తక్కిన వారన్న నాతనికి లెక్కయేలేదు. ఇట్లున్న ముందేమి ముప్పు వాటిల్లునో. ఇంక వారికి మనకుఁ బొత్తు కుదురదు. యుద్ధము తప్పదు. మొలత్రాడుగట్టిన మొనగాండ్రందఱు సంగరమున నిలువవలయును. రెండుమూఁడు రోజులలో యుద్ధమునకు సిద్ధపడవలయును. సంగరమునకు వచ్చువారందఱు ప్రాణముల

మీఁదను కళత్ర పుత్రాదులపైనను ప్రీతిఁ బెట్టుకోరాదు. ఇప్పుడు ధరించిన వీరకంకణములను యుద్ధానంతరమే విసర్జింపవలయును. త్రికరణశుద్ధిగ రాజభక్తిఁ బ్రకటించవలయును. శ్రీ చెన్నుఁడే మనకు శ్రీరామరక్ష కాఁగలఁడు. ఇందుకు సమ్మతులైనవారు రావచ్చు'నని బాల మల్లిదేవుని వీరమేడపికిఁ బట్టముగట్టి నిజసుతుని బాలచంద్రుని సచివకార్యమునందు నియోగించెను. మఱియు రాణివాసమునకు రక్షకుల నేర్పఱచి నలగామరాజునకు యుద్ధవార్తను దెలియఁబఱచి ఒక్క శుభముహూర్తమున—

"బ్రహ్మన్న గదలెను బాయని వేడ్కఁ
బట్టిరి గొడుగులు పాలకినెత్తి
సూర్యాతపంబుపై సోఁకనియట్ల
పాలకీలను నిరు పార్శ్వంబులందు
నందంబుగాఁ బట్టి రరిగెలు జోళ్లు
వింజామరంబులు వెలయఁగా నెమలి
కుంచెల వారును గూడి వీవంగ
నాయఁడు రాజులు నయముతోఁ జనఁగ
ముందు డమామీలు మురజసంఘంబు
బూరలు భేరీలు పోటు ధారలును
గాహాళ వంకిణి కాలికొమ్ములును
శంఖ సమూహంబు సన్నాయిజోళ్లు
మురళీచయంబును ముఖవీణె వితతి

నరగలు తప్పెటల్ నయమైన డోళ్లు
తమ్మటమ్ములు నెంచఁదగు పీరణములు
ఘనమైన రుంజులు కనక తప్పెటలు
చేగంటలును మఱి చిఱుగంటచయము
ఘనమైన మ్రోఁతచే గగనంబు గప్పఁ
గుంభిని వణకంగఁ గులగిరు లెల్లఁ
బతిమ్రోఁత లీయంగఁ బయనంబు సేసి ”

* * *

* * *

పౌరుషమ్ములు మీఱ బ్రహ్మకిట్లనుచు
మముఁజూడు నాయఁడా మా లావుకొలఁది
మముఁ జూడు బ్రహ్మన్న మా శౌర్యపటిమ
సింధురమ్ముల మీఁదఁ జెన్నుగా దుమికి
కుంభస్థలంబులు క్రుంగఁ జేసెదము
కోదమసింగంబులఁ గూలఁ ద్రోచెదము
డింఢభేరుండాల ఖండింతు మలుక
వాయువుఁ బోనీక వడినాపఁ గలము
జాతవేదునిఁ బట్టి చమిరివైచెదము
ఘనసముద్రముఁ జొచ్చి కలఁగఁ జేసెదము
కుంభినిఁ గాళ్లతోఁ గ్రుంగఁ దన్నెదము
కులగిరులైనను గొట్టివైచెదము
గురిజాల నేలెడు కువలయేశ్వరునిఁ

గొలపగ కైపట్టి క్రొవ్వణంగించి
చలమున విడువక చంపఁగాఁ గలము'
అని పెక్కుపంతంబు లాడుచు నడువఁ
జూచిన వారలు చోద్యంబుగాఁగఁ
బటువిక్రమాఢ్యులు పల్నాటి వీర
నరులంచుఁ బొగడుచు వర్ణించి పలుక
మలిదేవభూపతి మంత్రి బ్రహ్మన్న
కంపింప భూస్థలి కార్యమపూడి
చేరువనున్నట్టి క్షేత్రంబు కడకు
పరమోత్సుకంబుగా భటులేగుదేర

* * *

ప్రతిపక్ష బలములు ప్రజ్ఞమీరంగ
సేనలన్నిటిఁ గూడి చెలరేగుచుండి
బింకంబులాడుచు బీరంబు లెసఁగ
నేలయీనినరీతి నిరసింపఁ బగఱ
ఇసుకవేసిన రాల దిందనఁగ వారు
కలనికాయత్తమై కలసి రొండొరుల. ''

౧౨

"ధనమూల మిదం జగత్" అన్నట్లు ఎట్టివాఁడేని ధనవం తుఁడే పూజ్యుఁడు. అతఁడే విద్వాంసుఁడు. అతఁడే శూరుఁడు. ప్రతివారు నాతనినే సన్మానింతురు. ఉపకార మున్నను లేకున్నను ధనికునిఁ జూచిన దరిద్రుఁడును వాని పజ్జఁ జేరును. ఆబాలగోపాలము కాంతాకనకములపై నాస గల వారే కదా! ధానికున్న — వాఁడే తినును. మనకేమి యని గ్రుడ్డిలోకము విచారింపదు. ఉన్నవాఁడును లేనివాఁడును గలవానినే గౌరవింతురు. లోకములో ధనము సాధారణముగ వ్యాపారముఁ జేయువాని నాశ్రయించియుండును. పాలికులది ధాన్యలక్ష్మి. అందులకే వర్తకులందఱు ధనికులుగను రైతు లందఱు ధాన్యవంతులుగ నుందురు. ఇది లోకము నడవడి.

సీరమేడపల్లిలోని వారు భాగ్యవంతులని వేఱుగఁ జెప్పఁ బనిలేదు. అందలి వైశ్యులు కుబేరుని ధిక్కరింతురనుటలో సందేహము లేదు. అందొక వైశ్యునకు కేదుగురు పుత్త్రిలుండిరి. అందఱకు వివాహా మతి వైభవముగ జరిగెను. కోదండరామును కొడుకులును సేవించుచుండ వృద్ధ దంపతు లింద్రభోగమునం దులఁ దూగుచుండిరి. సిరియు సంపదయుఁగల్గిన సావుకారు లేమైన నేమి? 'కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా' అన్నట్లా యూరివా రెంతటి భాగ్యవంతులైనను తమ గృహకృత్య ములు తామే నిర్వహించుకొనుచుండుట అలవాటు. గ్రామ మున కంతటికి మంచినీటి బావి ఒక్కటా యూరి కడభాగపు

మైదానమునం గలదు. అమ్మలక్క లందఱు ప్రాతస్సాయం సమయములం బెండ్లికిం బోవునట్లు బావికింబోయి నీరు తెచ్చు కొనుట పరిపాటి అయ్యెను. ఒక్కనాఁడా ధనిక వైశ్యుని కోడం డ్రేర్వురు నూరబావికిఁ బోయి నీరుగొనిరా కుంభములఁ జంక నిడుకొని పోవు చుండిరి. ఆ త్రోవ ప్రక్కనం గొందఱు బాలు రాట లాడుకొనుచు నింకను బాలచంద్రుఁడు రాలేదే అని ఎదురు చూచుచుండిరి. ఇంతలో నొక బాలుఁ డటకు రివ్వున పరుగెత్తుకొనుచు వచ్చెను.

బాలురు:- "ఏమిరా! అనపోతా! బాలచంద్రుఁ డేడి? నీవీ రోజున ఆట కాలస్యముగా వచ్చుచున్నా వేమి?

అనపో:- అది గాదోయి! నే నింటినుండి త్వరగానే బయలు దేరితిని. దారిలో బాలచంద్రుని యొద్దకు వెళ్ళి పిలి చితిని. ఆతఁ డింటిలోఁ దల్లికడ మారాము జేయు చుండెను.

బాలు:- ఎందులకు?

అన:- ఈరోజున ఆటకు కావలసిన బొంగరములకు.

బాలు:- ఈ బొంగరములకు మారా మెందుకోయి? లేనిపోని శ్రమ. మన దగ్గఱ వలసినన్ని గలవే?

అన:- ఈ బొంగరములు కావు. ఇట్టి వాతని దగ్గఱ లక్షోప లక్షలు. బంగారపు బొంగరము కావలయునట. వాని తల్లి ఊరిలోని పిల్లలతో నాటలకే పోవద్దని, ఇంకేవేని

ఆట లాడుకొమ్మని చెప్పుచున్నది. ఆతఁడు పట్టిన కుందేటికి మూఁడే కాళ్లుగా ! మన మెఱుఁగని దేమి? తల్లి మెడఁ జుట్టుకొని నా కా బొంగరమే కావలె నని పట్టు బట్టెను. నాకు మాత్ర మీ వెండిబొంగరము లిచ్చి ముందు పంపెను. నేను వచ్చితిని.

బాలు:- ఇంతకు నాతఁడు వచ్చునా ? రాఁడా ?

అన:- రాకేమి ? ఈ పాటికి రావలసినవాఁడే ! ఎందుకు రా కుండెనో తెలియదు. ఈలోన మన మాడుకొందమని — ఆటల కుపక్రమించిరి. అంతలో నొకఁడు 'అదుగో బాలచంద్రుఁ' డని కేక వెట్టెను. బాలురంద ఱాతని కెదురుగా వెళ్లి — 'బాలచంద్రా ! ఇదెక్కడి బొంగరము ? ఇంత బరువు గలది నీ వెట్లు తెచ్చు చుంటి వోయి' అని బాలురు వానిచుట్టు మూఁగి పల్కిరి. అప్పుడు

బాల:- మిత్రులారా ! ఇది మా నాయనమ్మగా రింటిలోనిది· దీనిని సాధించి తెచ్చుటకే యింత ఆలస్య మైనది. ఇంకి నాడుకొందము రండు.

బాలు:- (ఆటస్థలము జేరుచు) మీ నాయనమ్మ కెక్కడి దోయీ ఈ బొంగరము ?

బాల:- మా నాన్నగారి జనన కాలమున నాగలోకము వా రొసఁగిన దఁట. ఆమె దానిని గన్నుల కద్దుకొనుచుఁ

గాపాడుచున్నది. నేఁడిది నా కంటఁ బడినది. దీని కొఱకే మాఱా మొనర్చి తెచ్చుచుంటి నని చెప్పి, ఇదిగో "మిత్రులారా! నా బొంగరమును వదలుచుంటిని. ఆవలకుఁబొం" డని జలతారుకుచ్చు దారముతో దానిని వదలి అఱచేతిలోను. బాణాగ్రము పై నునిచి విచిత్రముగ నాడించెను. పిల్ల లందఱు దాని నుండి బయల్వెడలిన రుంయి-రుంయి మను శబ్దమునే ఆనందముగ వినుచుండిరి. మఱికొందఱు బాలు రుత్సాహముతో 'బాలచంద్రా! ఏదీ మఱొక్కసారి ఎగురవేసి ఆడించు' మనిరి.

ఇంతలో నా వైశ్య వనితలు పూర్ణకుంభములఁ జంక నిడికొని వచ్చుచుండిరి. చెట్టుక్రింద బాలు రాడుకొనుచునే యుండిరి. అంతలో జన సమూహము నుండి 'బాలచంద్రా! ఇంకొక్కసారి నీ బొంగరమును విసరు' మన్నసవ్వడి బయలుదేరెను. దానిని విని బాలుఁడు – 'ఇదిగో వేయుచుంటిని – తొలఁగుడు తొలఁగు'డని బొంగరమునకుఁ ద్రాడు చుట్టి ఒడుపు గని పెట్టి ఆకసము వైపునకు విసరెను. వైశ్యవనితలా బాలుని రూపరేఖావిలాసముల వినియున్న వారే గాని చూచి యెఱుఁగక పోవుటచే నాతనినిఁ జూడఁదలఁచి వారల్లే అందు నిలువఁబడి చూచుచుండిరి.

అంతలో నా బొమ్మర మాకసమ్మున నుండి దిద్దిరం దిరుగుచు నశనిపాత మట్టుల పెటీలున నా యువతులలోని

వేషాంబిక పాదాంగుష్ఠముపైఁ బడెను. ఏసరుపాటున నున్న ఆమెయు దోడనే క్రింద పడెను. పాదమునుండి రక్తము జొటజొటఁ గారు చుండెను. బాలురందఱు నామెచుట్టు గుమి కూడిరి. ‘ అయ్యో ! అయ్యో ! ఎంతపని జరిగినది ? ఎంత దుడుకువాఁడు బాలుచంద్రుఁడు ? కన్ను మిన్ను గనపడకుండ మిడిసి పడుచున్నాఁడని తలకొకరీతిగాఁ బలుకు చుండిరి. బాల చంద్రుని మోము చెన్నుదఱిగి యుండెను. అంతలో వేషాం బిక ‘ ఏడీ – బాలచంద్రుఁడు? ఎంతవాఁడవైతివి నాయనా ! నీ విట్టివాఁడ వగుటచేతనే తండ్రిని యుద్ధమున కనిపి యింటఁ గ్రీడాలోలుఁడవై ఆడువారి పాదము లూడఁగొట్టు చున్నావు. చాల బుద్ధిమంతుఁడవు. బలశాలివి ’ అని నిష్ఠురోక్తు లాడి యాడి మూర్ఛిల్లెను. అనపోతనాదు లామెకు శైత్యోప చారము లొనర్చి యింటికిఁ జేర్చిరి. బాలచంద్రుఁడు దైన్య ముతో నొంటిగ నింటి కేగుఁ దెంచెను. ఐతాంబ లోనఁ బ్రవేశించు బాలునిఁజూచి “ నాయనా ! నీ మోము వాడి వత్తలైనదేల ? ఆటలో నూడితివా ? ఎవ్వరైన నేదేని అనిరా ? నీ కేమి కావలెనన్న దాని నిచ్చుచునే ఉంటినే ? ఎందుల కింత కించనడుచుంటివి ? ” అని బహువిధముల బాలుని బుజ్జగించి అడిగెను.

అంతట బాలుడు ‘ తల్లీ ! వీరమాతృగర్భమున జన్మించి మంత్రిపదవిలో మాన్యతఁగన్న నేనూడుటయా ? ఎన్నఁడైన నిట్టి అపయశము వింటివా ? దానికేమిగాని ఒక్క మనవి. నిజము బల్కుదువుగద ! అని నమస్కరింపుచు నా తండ్రిగా

రిప్పు డెందున్నారు? దాపక చెప్పు' మని ప్రశ్నించెను. వాడి ములుకులు గ్రుచ్చుకొన్నట్లే మాట లైతమ్మగుండె నాటి పఱియలయ్యెను. కన్నులకుఁ గప్పుకొనెను. కన్నీటివాలునఁబడి కాటుక జాలువాఱెను. విచారింప దొఱకొనెను. బాలుని ప్రశ్నలో నైతమ్మకు యుద్ధప్రయత్నము గోచరించెను. అది వారింపఁదలఁచి 'కుమారా! మల్లిదేవుని ఆజ్ఞ ననుసరించి మీ నాయనగా రెక్కడికో అరిగినారు. నిజమెఱుఁగ' ననెను. బాలుఁడా మాటలకు 'తల్లీ! అసత్యములాడ నెఱుఁగని నీవు నేఁ డిట్టిమాట లెందులకు బలికెదవు? మల్లిదేవరాజు సంగర మొనర్చుటకై సన్నాహముతో నా తండ్రిని వాని వెంటఁ గొనిపోయి రణమాచరించుచున్నమాట నే నెఱుఁగుదును. నీవేల దాచెదవు? కన్నతండ్రి ఋణముఁ దీర్పని పుత్రుఁ డుండి యేమి? మండి యేమి?

" కార్యమపురమందు ఘన పరాక్రమతఁ
దండ్రులు నిలుచుండి దండుసేయంగ
నే నింటనుంకుట నీతియే తల్లి?
ఉండుమంటకు నీకు నొప్పునా మనసు
నీ వెఱుంగని ధర్మమే నెఱుంగుదునె?
ప్రాకృత భామల పగిదిఁ బల్కెదవు
వెఱ్ఱితనంబేల వీరుని సతికిఁ
కాయ మనిత్యంబు కల్మి వాళక్కె
జలబుద్బుద విధంబు క్షణభంగురములు
షట్చక్రవర్తులు సకల భూపతులు

చనిరి బ్రహ్మేంద్రాది సర్వదేవతలు
భూతంబులైదును బొలియుచునుండు
శౌర్య సత్కీర్తులు సమయ వెన్నటికి
సకల పురాణముల్ సద్ధర్మకథలు
నీతిశాస్త్రంబులు నీ వెఱుంగుదువు
పౌరుషాధికతచే బ్రదుకుట లెస్స
జననమరణములు జనులకు నిక్క
మాలయంబున నున్న నడవిలోనున్నఁ
దప్పక దార్కొనుఁ దథ్యంబుగాను
బుణ్యలోకంబును బొందు మార్గముల
వినిపింతు నేఁ దల్లి విశదంబుగాను
సజ్జనసంగతి సంసారమొడల
గురువు బోధించిన గుఱిమీఁద మనసు
నిలిపి మరణ మొందు నిశ్చలుఁ డొకఁడు
ప్రాజ్యసామ్రాజ్య సంరక్షణమందు
ఘన రణమ్మున ఱొమ్ము గాయాల నొంద
మనసు చలింపక మరణంబు నొందు
శౌర్య పరాక్రమ సంపన్నుఁ డొకఁడు
వీర లందఱు లెస్స వినువీధి కేగి
ఆదిత్య మండలం బరు దారఁ జించి
పోయి పుణ్యంబుల భూమిఁ జెందుదురు
మొదటి కార్యముఁ బూను ముఖ్యత లేదు
శౌర్యంబుచే మాకు సంపాద్య మగును" —

అని పలికెను. అంతఁ దల్లి కన్నుల నీరు నించి "నాయనా! నీవు మా కేకైక పుత్త్రుఁడవు. కన్నులకద్దుకొని పెంచుకొను చున్నాము. అదిగాక నీవు బాలుఁడవు. అదియా భండన భూమి. మీ నాన్నగా రెన్నో విధముల నిన్నుఁ బంప వలదని చెప్పి వెళ్ళిరి. నీవు సౌఖ్యములందఁ జాలుదువని గంపెడాసతో నున్న మమ్ము వ్యర్థులగాఁ జేతువా? వంశపాలకుఁడవు గమ్మ. తల్లిమాటఁ ద్రోసిపుచ్చి దురమునకేగు తనయులు లోకమున గలరె?" అని పెక్కురీతులఁ బ్రేమతో సామదాన భేదములఁ జెప్పెను బాలుఁ డా మాట లెల్లఁ విని "అమ్మా! నీవెవ రవు? నే నెవరను? నే నెందఱకుఁ బుత్త్రుండ నైతినో? నీ వెందఱకుఁ దల్లివైతివో? ఈ తనువు లెన్నటికైన నస్థిరములే. ఏది శాశ్వతము? నీ వెఱుఁగని దేదియు నిందు లేదు గాని సర్వమును మిథ్యయే గదా! సర్వ రక్షకుఁడు శ్రీ చెన్నకేశ్వ రుఁడుండ మనకుఁ గొఱఁత యేమి? తల్లీ! అచ్చట కేదార సస్యము పండి ఒరిగి యున్నది - ఇచ్చట లవిత్ర మున్నది; అచ్చోట కోశవ్రాత మున్నది; ఇచ్చట కరవాల మున్నది; అచ్చట హాన్యముండె - ఇచ్చట హుతాశనుఁ డుండె; అచ్చట భూధరవ్రజము - ఇచ్చట వజ్రసాధనము; అచ్చటఁ జిమ్మ చీఁకట్లు - ఇచ్చట దినకర మండలము; అచ్చట శత్రుసైన్య ములు - ఇచ్చట నే నుండుటయా? అంబా! నే నిదే శాత్రు వుల పీచ మడచివచ్చిగాని నిన్ను దర్శింపను. అనుమతినిమ్ము" అని తొందరపెట్ట సాగెను.

అత్తఱి నామె కేమియుఁ దోఁచక తన యత్తగారి దగ్గఱకు పరువెత్తి సర్వమును విన్నవించెను. విషయమంతయు విని శీలమ్మ దైవజ్ఞులఁ బిలిచి బాలుని జాతకచక్రమును వారి యెదుట నుంచెను. "పదునైదు దినములలో బాలుఁ డుర్విని వీడు" నని వారు జోస్యము జెప్పిరి. శీలమ్మ కోడలినిఁ జూచి 'అమ్మాయి! బ్రహ్మవ్రాత తప్పదు. కాల మెవ్వరికిని గడవరానిది. నీ మాట నాతఁడు విననిమాట నిశ్చయమే. కాని ఒక్కఉపాయము జెప్పెదను. వినుము. వానిభార్య మాంచాల నిండు పర్వములో నున్నది. ఆమె రూప మనన్యము. అదృష్టమున్నచో నామె పల్కుల వలన నతఁ డాగిన నాగవచ్చును." అని పల్కెను. సరేయని వచ్చి ఐతమ్మ పుత్రమోహమునఁ జెప్పవలసిన శాంతవచనములఁ జెప్పి కుమారునితో నిట్లు బలికెను. 'కుమారా! యుద్ధమునకుఁ జనువారు తల్లి దీవెన ఒక్కటియే కొనుట గాదు. సతీమణి దీవెన కూడ దీసికొని పోవుట శ్రేయస్కర" మని బోధించెను. ఆతఁడును సిగ్గిలి "తల్లీ! మాంచాల నన్ను గుర్తుపట్టునో లేదో? పెండ్లి కాలమునాఁటి దర్శనమేగాని యీలోపు పరస్పర ముఖావలోకనము లేదు. ఇప్పుడు నే నచ్చటికిఁ బోవు టెట్లు? ఈ సమయమున నే నచ్చటకుఁ బోరా" దనెను. అట్లయినచో 'నాయనా! నేను ముందరిగి వచ్చెద' నని ఐతమ్మ గౌరాంబను, తులసీరమాదేవిని, ముక్తాలవాంబను, మాచాంబను వెంట నిడికొని కోడలికడకుఁ జనియెను. మాంచాల తల్లి రేఖాంబయు వియ్యపురాండ్ర నందఱిని తగు మర్యాద లొనర్చి

కూఁతును బ్రెముక్కించెను. తరువాత నత్తకోడండ్రు కొంతవడి నేదియో సంభాషించుకొనిరి ఆపిమ్మట నైతాంబ తన కుమా రుని యుద్ధ ప్రయత్నము మాన్ప లేక పోవుటయు, జెప్పి మాన్పింపఁ గోడలిని నియమించి తగు కట్టుదిట్టములఁ జేసి తోడివారితోఁ దన యిరవున కేగి బాలు నట కంపెను.

---

## ౧౩

"పతి గలిగిన సతికి నింద్రపద వది యేలా ?" అని పెద్దలు వాక్రుచ్చిరి. పతికన్న దైవము సతులకు మఱొక్కఁడు గలఁడా ? పతివ్రతలు తమ భర్తృసేవచే నసాధ్యమగు కార్య ములఁ బెక్కింటిని సాధింపలేదా ? సతీమణి సావిత్రి, పరమ పావని సీత, సాధ్వీమతల్లి అనసూయ మొదలగువారే ఇందుకుఁ దార్కాణము. భర్త అనుటతోడనే బాలికయైనను పరమాను రాగ మందుట శీలవతుల లక్షణము. అట్లే మాంచాలయు భర్తృరాకకై నిరీక్షించుచు శృంగారవతియై ఎదురు చూచు చుండెను. మందిరద్వారముల మణితోరణముల నమర్చెను. రత్నకంబళముల నేల దీపింపఁ జేసెను. ఎదురగఁబోయి ఆరతు లీయ నంగనల నేర్పాటు గావించెను. ఫలోపహారములు సిద్ధ పఱచెను. వింజామరల నిల్పెను. దండధారుల నియమించెను. ఒక్కటేమిటి ? సర్వము నాయత్తపఱచెను. లోలోన మురి యుచు భర్త ఒక్కఁడే వచ్చునో లేక సోదరులతోఁ గూడ

వచ్చునో ? అట్లయినచో వానిని గుర్తించు టెట్టులని ఉబికి పోవుచు రివ్వున తల్లియొద్దకుఁ బరువిడిపోయెను. రేఖాంబయుఁ గూఁతు నొడిలోనికిఁ దీసికొని 'ఏల సిగ్గిలెదవు తల్లీ? నీ యభిప్రాయ మేమి ? మనస్సు విప్పి చెప్పు' మనెను. అప్పుడు మాంచాల 'అమ్మా! నేను నా భర్తను గుర్తించుటకుఁ దగిన చిహ్న మొక్కటిఁ జెప్పు' మనెను. అంత రేఖాంబిక 'చిట్టితల్లీ! నీ భర్త ఆసనాసీనుఁడై ఉన్నతటి నీ వటకేగ నీ మఱఁదులందఱు లేచి నిలుచుందురు. కూర్చున్నవానిని భర్తగా నెఱుఁగుము. సందియము వల' దని బోధించి పంపెను. ఇంతలోఁ గోఱమీసమును, జలతారు కుచ్చు తలపాగయు, మణిమయ హారములును, కలికితురాయిని, హేమకంకణములు, నుక్కు కవచమును, పట్టుధట్టియు, నడుమునఁ జుఱుకత్తియుఁ జేత ఖడ్గమును ధరించి సోదరులు వెంటరాఁ బాలుఁడు మాంచాలా లంకృత మణిమయ సభామండపమునఁ బ్రవేశించి సేవకుల సూచకము లందుచుండెను.

ఆ వార్త నామె విని ముగ్ధమోహనమూర్తియై సభాంగణమున కరుదెంచెను సేవకులందఱు బరాబరులు సల్పుచుండిరి. మఱఁదులు లేచి నిలువఁబడిరి. అనపోతయు, బాలచంద్రుఁడును గూర్చుండి యుండిరి. మాంచాల పొరబాటున నాపిన్న బాలకుని పాదములకు నమస్కరించి ప్రక్షాళనమొనర్పఁ బూనెను. అనపోతు వెంటనే లేచి నేను బ్రాహ్మణుఁడను గాన నీ సేవము చెడునని నిలుచుండనైతిని. నీ మఱఁదిని. అదిగో శాత్రవ భయదుఁడైన నీ భర్త. అని నిర్దేశించి

చూపెను. అంతట మాంచాల ' అయ్యా ! నీవు బ్రహ్మకులుఁడవు. వేదవేత్తవు. నేను నీ చరణములు స్పృశించుటలోఁ బవిత్రురాల నైతినని యుక్తిగఁ గొనియాడి భర్త చరణ పద్మములఁ బన్నీటితోఁ గడిగి తుడిచెను. బాలచంద్రుఁడప్పు డనుజుల వైపు జూచెను. వారు నదిగ్రహించి ' రణముమాట మరువకు ' మని హెచ్చరించి వెడలిపోయిరి. మాంచాలయు ' నేఁడు గదా పండు ' వని భర్త నతిభక్తిఁ బూజించుచుఁ దనివి నొందు చుండెను. కొంతవడి కామె పతిచెంతఁ జేరి ' నాథా ! జన్మవృక్షమునకు రుచిగల ఫలములు రెండు. అవి ఒకటి భోగము, రెండవది కీర్తి. తొంటి దిప్పుడు లభించినది. కీర్తి యీపై సాధ్యము. లెండు. రణమునకుఁ బొండ ' ని బాలచంద్రునిఁ బోత్సహించెను. ఆతఁడును లోలోన మాంచాల పాతివ్రత్యమునకును వీరవనితాత్వమునకు పొంగిపోవుచు " సతీ ! నాకు సెలవా ? పోయి వచ్చెద " నని క్రీఁగంటి చూపులఁ గరుణ తొలుకాడఁజూచుచు యుద్ధభూమికిఁ బయనమయ్యెను. ఇంతలో మాంచాల తన ప్రియునకు " శోణ తిలకము నొసటఁ బెట్టుచు శాత్రవ విజయము - సాహసము- పరాక్రమము నమరుగాక ! " అని దీవించి ఆయుధమును జేతి కందిచ్చి యిట్లనెను. నాథా ! మీరు సమరాంగణమునకుఁ బోవునప్పు డనపోతనను మాత్రము గొనిపోవలదు. దాన మన వంశమునకు బ్రహ్మహత్యాదోషము వాటిల్లును." బాలచంద్రుఁ డా మాటలకు ' సరే ' యని తల్లియొద్ద కేగి కడుపార భుజించి నమస్కరించి దీవెనలంది అనుజులతోఁ

బయన మయ్యెను. అనపోతనయు సోదరప్రేమతో వారి వెన్నంటి పోవుచుండెను.

త్రోవలో బాలుఁడు విప్రబాలకునిఁ జూచి "పోరికి వద్ద' ని చెప్పుటకు మోమోట బడుచు 'అనపోతనా! నా ముద్దుటుంగరమును పొరపాటున మీ వదినెయొద్ద మఱచి వచ్చితిని. వేగముగాఁ బోయి కొనిరమ్ము. అంతదనుక నే నీ శీతలతరుచ్ఛాయ నధివసించెద నని యుక్తిగ పంపెను. ఆతఁడశ్వమునెక్కి ఒక్కదూఁకులో మాంచాలనుదర్శించి అన్నగారి యాజ్ఞను దెల్పెను. ఆమె దానికి నవ్వి 'మీ యన్నయేమి? ఉంగరమును మఱచి జనుటయేమి? ఇది యంతయుఁ గల్ల నాయనా! నా యొద్ద లే' దని చెప్పి పుచ్చెను. అంతట ననపోతన "ఔరా! బాలుఁడు నన్నేల పంపెను? నేను యుద్ధమునకు వచ్చుట కిష్టములేకనా? లేక చేతగానివాఁడ ననియా? మా యిరువురి ప్రాణము లొక్కటియె గదా! ఆతఁడింత మోసగింపనేల? మిన్నువిఱిగి మీఁదఁ బడినను రణమున వానింగూడి జయమో, పరాజయమో పొందెద" నని తలంచుచు వృక్షము కడకుఁ జేరెను. అక్కడ బాలచంద్రుఁడు లేఁడు. పరికింప నొక్క తాళపత్రలేఖ అట పడి యుండెను. దానినిఁ జూచి —

"సోదరా! నీవు విప్రోత్తముఁడవు. యోద్ధలకు కలనిలో బ్రాహ్మణసహాయ్య మధర్మము. నీవు పురమున కరిగి

అంతిపురములోని వారిని రక్షింపుచుండుము. యుద్ధభూమికి వచ్చితివేని శ్రీ చెన్నునియాన. నాయనిపై నొట్టు. నాతోడు.

బాలచంద్రుఁడు ''

అని చదివికొని గుండె బ్రద్దలై — విభ్రాంతితో ''అయ్యో! నా యాశయము లన్నియు బూదిలోఁ బోసిన ఆజ్యమట్లయ్యెను బాలుఁడేనా యీ లిఖించినది? కాక మఱెవ్వరు లిఖింతురు? అని నిర్వాఱఁగంది బాలచంద్రా! నన్ను బేలగా నెన్నితివా? తనువులు వేఱుగాని ప్రాణ మొక్కటియేగా! అని మఱియు మన ప్రాణస్నేహమునైనఁ జూడవైతివే? పోనీ నా క్షేమమునకై నీ విట్లొనర్చిన నీ ఋణము నే నెట్లీగఁ గలను? ఇంటికిమాత్రము పోజాల. పోయిన నా బడుగుదనమున కాడువారు సైచక సాటసాటవ్వోయి కాకులు పొడిచినట్లు పొడువరా? ఇంక నా జన్మమేల కాల్పనా? ఇట్లు చేయుదువని ఒక్కనాఁడైన దలంపకపోతినే? అగ్రజా! ఎంతలో నాకుఁ దియ్యని నోరఁ జల్లఁగఁ జేదు మేపితివి. బాలచంద్రా! నా ప్రాణము లింక నిలువవు ... నిలువవు ... అని తలపోయుచుండ వీరనాయకులకు భోజనపదార్థములు గొనిపోవు 'అక్కపిన్నక్క' అను వనిత త్రోవ నగుపడెను. ఆమెను బిలిచి అనపోతుఁ 'డమ్మా! మీ యన్నల కన్నము గొనిపోవుచుంటివి గాఁబోలు! ఏ పొరపొచ్చెము లేక మాయన్న బాలచంద్రుని కేనిచ్చు ఈ 'ఉపదంశముఁ' గొనిపొమ్మని తన నిశిత కరవాలమున నిజహృదయమును జీల్చి గుండెకాయ నిచ్చి పంపి శ్రీచెన్నునిం దలఁచి —

" పుట్టు వొక్కనాఁడు - పురు డొక్కనాఁడు ప
ణ్యాహ మొక్కతటి - వివాహ మొక్క
నాఁడు, కాల మొక్కనాఁడు - మా కంచటి
కన్నదమ్ములకును జెన్నరాయ ! "

అని యోగసాధనంబున శరీరంబును విడిచి విష్ణుపదముఁ జేరెను. పంచభూతములా జీవుని త్యాగమున కెంత యు సంతసించినవి.

---

౧౪

'ప్రారబ్ధ ముత్తమ గుణా నపరిత్యజంతి ' అను నీతి ననుస రించి మహాత్ములు పూనుకొన్న కార్యమును నిర్వ హింతురు. అందునను వీరపురుషులును బాలురు తాము పట్టిన పట్టు విడువ నొల్లరు. దాని వలన వచ్చు నపకారము నేని తెలియరు. తా మనుకొన్నపని అగుటయే వారి నైజగుణము. ఇఁక వీరులను గూర్చి చెప్పవలసిన పనియే లేదు.

బాలచంద్రుఁ డెవ్వ రెన్ని జెప్పినను వినక కొదమ సింగము పగిది రణస్థలికిఁ దగరు నెక్కి పోఁ బోవ మేళ్లవాగు కార్యమపూడి నడుమను నాయకురాలు పంగఁజాచిన దనియు నట్లు పో వీలు లేదనియు ముందుగఁ దమ్ముల వలనఁ దెలిసి కొనియెను. బాలుఁ డది విని మండిపడి పంగను దాఁటిపోవ నుద్యుక్తుఁడై ఒక్క పరుగున దాని నుల్లంఘించి చనెను.

అచ్చట నాగులేటి కుత్తరభాగమున విడిసిన సేనావాహినినిఁ గనిపెను 'తమ్ములారా! ఈ పటకుటీరము లెవ్వరివై యుండ నోపును నాయకురాలి సేనలే యిచ్చోట నుండవచ్చు నను కొందును. లేదేని మన వీరు లెవ్వరును గానరా రేమి' అని తన గొరియపోతుచే నా సేనాకుడుంగములఁ ద్రొక్కించెను. అంత వాహినీపతి తమ లతాగృహముల నాశనము గావించుటకు శత్రువు ? కారకు లని యెంచి ఆ వీరపురుషునిపై కుతికెను. బాలుఁడును చమూపతియు పరస్పర సేనల నూటాడి పౌరుషోక్తులతో నన్యోన్య ముఖావలోకనములఁ జేసికొనిరి. అంత బాలుఁడు కన్నమదాసును జూచి సిగ్గిలుచు 'ఓయీ! ఇవి మన సేనలు విడిసిన చోటని ఎఱుఁగక యిట్లొనర్చితిని. కినుకఁ బూనకుము.'' అనుట తోడనే కన్నమయు బాలచంద్రు నాలింగనముఁ జేసికొని 'తమ్ముఁడా! నీవేల యుద్ధమునకు బయలుదేరితివి? తండ్రిగారు నిన్ను బాలమల్లిదేవాదుల కమాత్యునిఁగ నిల్పిరే? నిన్నిచట కెవ్వరంపిరి? పెద్దలుండ నీకేల? వీరమేడపిలో నందఱు కుశలమే గదా! అయినను ఇచట నాలము గాకుండ వారితో మనకు సంధి కుదురునట్లు తోఁచుచున్నది. అగుఁగాక! మిక్కిలి అలసితివి. భోజనాదులఁ గావింతము. మీ రందఱును మజ్జన మాచరించి రండి' అని చెప్పెను. పిదప నార్గురు సోదరులును గంగధారమడుఁగునఁ గ్రుంకులిడి పవిత్రవంతులై భోజనశాలల కరిగిరి. బాలుని మనస్సు మాత్రి మోములకో చీకాకుగ నుండెను. సోదరులు దానికిఁ గారణము గ్రుచ్చి గ్రుచ్చి అడుగుచుండిరి. కాని

చెప్పుట కేమియుఁ దోఁచకుండెను. అందఱును భోజనమున కాయత్త మైరి. రాజ మర్యాద ననుసరించి పదార్థముల నివే దించు చుండిరి. నడుమ 'అక్క పిన్నక్క' తెచ్చిన పదార్థ ములను వరుసగా వడ్డించుచు బాలచంద్రుని భోజనమున ద్విజామిషమ్ము నుంచెను. అతఁ డది గ్రహించి 'ఇదేమి?' అనెను. ఆమె విషయము నంతను దెల్పెను. బాలుఁడాపలుకుల కెంతయు దోదూయమాన మానసుఁడై 'అక్కటా! తమ్ముఁడా కాల మెంతలో నెట్లుగా మాఱెను? 'అన్యథాచింతితం కార్యం దైవమన్యత్ర చింతయే' త్తను నట్లయ్యెను. బ్రహ్మహత్య కొడిగట్టుకొన రాదన్న నా ధర్మపుఁ జేఁత భీభత్సునిగా మార్చి మహా పాతకాబ్ధినిఁ గూల్చివైచినదే! అనపోతా! నీ ప్రాణా వసాన సమయమున నీ పాపాత్మునే స్మరించితివిగా? మిత్ర ద్రోహిని. కృతఘ్నుఁడను. బ్రహ్మ ఘాతుకుఁడను. ఔరా! ఈ పాపము నన్ను కట్టి కుడుపక విడుచునా? నా తప్పు సైరింప సమర్థు లింకెవరు? ఇప్పటి వరకు నా మతి వికలమై ఉన్నం దులకు. స్నాన సమయమునఁ జెలమలో నీరునకు బదులు రక్త మూరుటకుఁ గల ఫల మిదియా? హా దైవమా! నీ చేఁతలు దురూహ్యములు.'' అని పరిపరివిధములఁ దపించి కొంతవడికి ధైర్యమవలంబించి తండ్రితోఁ గ్రోధరస ముట్టిపడ నిట్లనియెను.

“జనకా! బాలుఁడను. అజ్ఞుఁడను. పెద్దల చాటు వాఁడను. నే నొక ప్రశ్న మడిగెదను. కనలక నా సందేహ ముడిపి నన్ను గ్రహింప వేఁడెదను. మనకును శాత్రవుల

కును సంధికై వేచియుండుట తగనిపని. అలరాజు కన్న కేత రాజు కొమ్మలుదిరిగిన వాఁడనియా మీ భావము ? నలగామ రాజు కడకు సంధిగావింప నాతని యల్లునే పంపిన నెల్లక చంపించెనే ! అట్టిచో నేఁడీ కేతరాజు వచ్చి చెప్పిన మన మేల వినవలయును ? శత్రువు లొనర్చిన దుష్కార్యముల నొక్కొ-టొక్కటి లెక్కపెట్టిన గుండెబ్రద్దలగు చున్నది. తొలుదొల్త మాయచే బాలమల్లదేవులఁ జంప నగ్గిఁ బెట్టిరి. మన వైభవము నకుఁ జూపోపక ఎచ్చటనో మాచెర్లలో నున్న మన పైకి దాడి నంపిరి. కపట ద్యూతమున మనల వలసఁబోవు నట్లొన ర్చిరి. అడవిలో గోవులపైకి దోపిడిగాండ్ర నంపి గోవుల నపహరించిరి. జామాతగదా అని సంధికంపిన రాయబారిని విషప్రయోగముచేఁ బొట్టఁ బెట్టుకొనిరి. అట్టి దుండ గీండ్రను నమ్మి సంధి కొడంబడుటయా ? తండ్రీ !

" కడిమిఁ దొలంగి రాజ్యము సగంబుగ భూవిభుఁ డిచ్చెనంచు నే
యడఁకువలేక పుచ్చుకొన నర్హమె, కేల్లవసాచి దీనులై
యడిగి భుజింప విప్రులమె ? ఆహవకేళి రిపుక్షితీశులన్
దొడరి జయించి గైకొనుట తోఁచని ధర్మము వీరధర్మమే ? "

మనది వెలమకులము గాదా ? వేడి నెత్తురు లేదా ? చూచెద రేమి ? ఆజ్ఞ నిండు. మే మార్భాటము రణరంగముఁ జొచ్చి మదమాతంగములఁ జీల్చు సింహకిశోరముల రీతి జయముగొని వత్తుము. సందియము లేదు. ముమ్మాటికిని సంధి కొప్పుకొనరాదు. అయ్యయ్యో ! వనవాసమున నాకు లలములు దిని, పడరాని యిడుమలఁ బడి, పరుల పంచలలోఁ

దలదాచుకొని యుద్ధము - యుద్ధ మని నాఁటినుండి నేఁటి వరకు ప్రగల్భము లాడి చివరకు మిత్రునిఁగూడ గోల్పోయి కత్తిఁబట్టి కదనమున కుఱికి 'సంధి' అను శాంతవచనము లతో నింటికిఁ బోవుటయా? ఇదే నా శపథము వినుఁడు. సప్తసముద్రము లుప్పొంగి పుడమిపైఁ బడుగాక! సూర్య చంద్రుల గతులు దప్పుఁగాక! నక్షత్రములు నేలపై డుల్లు గాక! పంచభూతములు భంగము నొందుగాక! ఈ బాల చంద్రుని మేన ప్రాణములుండు వరకు సంధికొల్లఁడు. ఒల్లఁడు. ఒల్లనీయఁడును.''

వెంటనే సోదరపంచకమును క్రమముగా వారివారి ప్రతాపములఁ దెల్పిరి. బ్రహ్మనాయఁడా పల్కు లాలించి నిశ్చేష్టుఁడై 'వీరపుత్రునకు జనకుఁడ నైతి' నని ఆనందపడుచు 'ఓ బాలకులారా! మీ పరాక్రమము లేనెఱుఁగనివి గావు. అయినను కౌరవ పాండవ యుద్ధమున ఫలితమేమి కలిగెనో నాకు నంతియ ఫలమని సంధికిఁ జూచితిని. కాని జయము రావను దిగు లెన్నటికిని లేదు. కుమారా! నీయుద్దేశమే మా కందఱ కభిమతము. లేచి నడుములు బిగించుఁడు. యుద్ధ సన్నద్ధులు కండు. ఎవరి ధర్మము ను వారు నిర్వర్తించుకొనుఁడు' అని పెక్కురీతుల వారి నుద్దేశింపఁజేసెను. వెంటనే చారు నొక్కనిఁ బంపి 'శాత్రవులకు సంధికార్య మనంగీకారము. యుద్ధమే కర్తవ్య' మని తెలియఁజేసెను. యోధు లెల్లరును వీర పురుషోచితాలంకారముల ధరించి నాయని పాదారవింద ములకుఁ బ్రణమిల్లి 'వీరతాంబూలము' నిమ్మని కోరిరి.

బ్రహ్మాన్న వారినిఁ జూచి 'శూరులారా! అదిగో! ఆ పుట్టపై నున్న రత్నపాత్రలో వీడియ ముంచితిని. దానినిఁ దెచ్చు నాతఁడే ముందడుగు వేసి యుద్ధమున కేగవలయు' ననెను. దానికా ఆర్గురుపుత్రులును బ్రయత్నించిరి. అం దేవురు సర్పము గొట్టు బుసకు గుండెదడపుట్టి మరలి వచ్చుచుండిరి. బాలుఁడు ధైర్యముతో నించుక సేపాత్మలో గరుడుని స్మరించెను. తోడనే వామలూరుపై నాగాంతకుఁ డాడఁజొచ్చెను. అంతఁ బుట్టలోని సర్పరాజు గ్రుక్కిన పేనయ్యెను. తోడనేఁ బాలుఁడా వీరతాంబూలమును గ్రహించి తండ్రిచెంత నిలిచెను. తండ్రి బాలుని కౌఁగిలించుకొని 'బాలచంద్రా! నీవు నీ సోదరులతో ననికేగి పగతురఁబట్టి పల్లార్చుము. రాజునుబట్టి పగఁ దీర్చుకొనుము.' అని సెలవిచ్చెను. తోడ్తోన వారు లేళ్ళపై కుఱుకు బెబ్బులిచందమున దీపించి ఖడ్గపాణులై సంగరాంగణమునఁ బ్రవేశించిరి.

---

రణభేరీ ప్రమోగెను. ఢంకానినాదములు మిన్నుముట్టుచుండెను. కాహళములు సెలరేగెను. తూర్యారావము లుల్లసిల్లెను. పటహారవంబులు ప్రబలెను. నాల్గువేల విలుకాండ్రొక ప్రక్క నిలిచియుండిరి. పదివేలమంది బల్లెములవారు మఱొక్కచక్కి దీపించుచుండిరి. అశ్వపంక్తులు గజయూథములు ననంతములుగ దిరుగాడుచుండెను. శూలములు శరములు దాల్చి వీరవరులు నేల యీనినట్లు నడచుచుండిరి. ఎటుజూచినను ధ్వజములు ఛత్రములు శంఖారవములు గననయ్యెను. ఇంతలో నేనుగంబారిపై నలగామభూపతి రణమున కవతరించెను. ప్రాణములపైఁ బ్రేమఁ ద్రోసి సేనలు హాహారాహారిగఁ బోట్లాడుచుండెను. పందలు మాత్రము పాఱిపోఁజొచ్చిరి. తనువు లస్థిరములు, కీర్తి శాశ్వతమని ఒండొరులఁ బురికొల్పుకొనుచుఁ బోరాడుచుండిరి. బాలచంద్రుఁడు ఒరఁదీసిన కత్తియై పొడిచి నడచుచుండెను. సేనలఁ జిందరవందర గావించుచుండెను. తలలఁ గొన్నిఁటి నేలఁ గూల్చెను. చేతుల నఱకెను. తొడలు తునుకలు జేసెను. ఏనుఁగులపైకి సింహమై ఎగిరి తుండములు వాలములు దంతములు తుత్తుమురు గావించుచుండెను. గుఱ్ఱములపై కుఱికి డొక్కలుజించి, డెక్కలఁ గొక్కి ఱొమ్ముఁ బగిల్చి చెల్లాచెదరు జేసెను. శత్రుల బాణాసారము లెంత బలవత్తరములయ్యు బాలచంద్రుని పాటవమునకు సడలిపోవుచుండెను. బాలుని రోషాగ్నికి అరాతివర్గ మింధనమయ్యెను. ఒకవైపు బాలుని సోదరులు యుద్ధమున నాతనిని మఱపించు

చుండిరి. పలువురొక్కటై యేనుఁగుల గూల్చుచు, నరదంబుల శకలంబుల సేయుచు, హయంబుల నిరయంబు నొందించుచు గాల్బలంబులఁ గాలుని కాహుతి యొనర్చుచుఁ, గృపాణంబుల విదళింపుచుఁ, గుఠారమ్ములఁ జిమ్ముచు, ముద్గరంబుల నణచుచు, గదాఘాతంబుల నడిమస్తకంబుల నుగ్గుఁజేయుచుఁ గరంబుల జిదుముచు, నురంబుల రుధిరంబుట్టిపడఁ జేయుచు, శిరోజశైవాలంబును, మేదఃపంకంబును, అస్థిచూర్ణసైకతంబును, కబంధవిహంగ సంకులంబై రక్తాంబుపూరిత మహాప్రవాహంబు నా సమరాంగణం బొప్పారెను.

అట్టితఱి నలగాముఁడు కరిపై నెక్కి సేనాధిపతులఁ బురికొల్పుచు బాలుని దిక్కుమొగంబై చనియెను. బాలుఁ డది కాంచి, అవహేళనగా 'రాజా! హనుమంతు నెదుటనా కుప్పిగంతులు. వచ్చినదాకె పట్టుము. లేకున్న శరణనుము. అంత

నల:- ఓరీ! వాచాటా! తాటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదరు నను కొంటివా? రమ్ము. చేతనైన జయించి రాజ్యము గొనుట ఉచితము గాని, వృథాలాపములఁ బ్రయోజనము లేదు. నన్నెదుర్కొన నీచేతఁగాదు. నీతండ్రిని రమ్మనుము. ఊ......తొలఁగుము.

బాలు:- ఓయీ! రాజా! నేఁ జాలనా నీ బండాలమునకు. నీకు నాగాంబ తోడు గాఁబోలు! మందుల మాయల విందొనర్చి వీరులఁ జంపిన మిమ్మొక్క చిటుకలోఁ

గండతుండెములుగఁ జేయనిచో ... ... నే బాల
చంద్రుఁడనే.

అని హుంకరించి సైన్యముతోఁ జట్టుముట్టెను. వెంటనే బాలుఁడు కత్తితో వానిపై కుఱికెను. అదిచూచి నలగామఁ డేనుఁగును దిగి రక్తధారలు మేనఁ దొరఁగుచుండ బాలచంద్రుని ధాటి కోర్వలేక యుద్ధభూమిని వీడి కాలికి బుద్ధిఁ జెప్పెను. "యథారాజా తథా ప్రజాః" అన్నట్లు సేనయుఁ బాఱిపోఁ జొచ్చెను. బాలుఁ డందఱుఁ దఱిమి రణభీరువులఁ జంపరాదని విడిచిపెట్టి సోదరులతో నాయని కడకు వచ్చి నమస్కరించి జరిగిన దంతయు విన్నవించెను. అందులకు బ్రహ్మనాయుడు సంతసించుచు 'నాయనా! అగ్నిశేషంబును శత్రుశేషంబు నుంచరాదు. ఈ మాత్రమునకే సంతసించుచుంటివా? శత్రువులు సమయమువేచి చంపఁ జూతురు. ఇప్పుడోడిన నారన్న సంతసింపరాదు' అని పలికెను. ఆ మాటలకు బాలుఁడు పౌరుషము దెచ్చుకొని మరల యుద్ధభూమికరిగెను. నలగామరాజు గురిజాలనుండి గొప్పసేనను గూర్చుకొని శత్రుమస్తకములఁ దూరుపారఁ బట్టెదనని దంభము లాడుచు కాలరుద్రుని పగిది మండిపడుచు ననిలోఁ బ్రవేశించెను. సైన్యాధిపతులు 'బాలచంద్రుఁ డెక్కడ? — ఏడీ — పొడిచెదము — గెలుతుము" అని కేకలు వైచుచు ఉత్సాహోపేతులై అటునిటు చాటుమాటుగఁ దిరుగఁ జొచ్చిరి. అంతలో నొక్కఁడు తురగము నెక్కి ఖడ్గమును జేతఁద్రిప్పుచు బాలుని కెదురు వడిమెను. ఆతని నెమ్మొసలతీరు, నేత్రసౌందర్యము, తలపాగ

లోని అందము, ముఖములోని గాంభీర్యము, బాహుదండ ముల ఘనతఁజూచి, పరికించి ఆతఁడే నలగాముఁడను గోపముతో నొక్క వ్రేటునఁ దల నేలఁ గూల్చెను. దానినిఁ గొని ఆనందముతో జనకుని యొద్దకేగి 'తండ్రీ! ఇదిగో నలగాముని శీర్షము ఒక్క వ్రేటున నేల గూల్చితిని. ఇంక మనకు శత్రుభయము లే' దని ఏమేమో పలుక బ్రహ్మనాయఁ డది విని 'కుమారా! ఇది నలగాముని తలగాదు సేనాధిపతి యుత్తమాంగము. దీనికింతగాఁ బౌరుషవంతుఁడ వనఁ బని లేదు. దీని విరోధ మతిశయించునే గాని సమయింప నేరదు. రాజు చావవలెను. రణ ముడుగ వలెను. కాని యింత మాత్రాన గాదు. నలగాముని తల దాచి యుంచిరి. నీవు తెలియలేవైతివి.' అని మొగము చిట్లించుచు బాలుని మాటలు పెడచెవినిఁ బెట్టెను. దానితో బాలుఁడు కోప వివశుఁడై 'ఏడీ నలగాముఁడు? ఎందుడాగినాఁడు? ఎటకు బాఱెను? ఎచ్చట నుండెను? అని హుంకరించుచు నొక్క అంగలో సేనామధ్యోర్విని వ్రాలెను. త్రోవన కేరళాధీశ్వరునిఁ, గర్ణాటకుని, మాళవరాజును ద్రుంచి పరువిడు చుండెను. నాఁటి ఆతని ప్రతాపమునకుఁ జంఝభానుఁడు సైతము గ్రిందగునేమో? తుద కొక్క చోట నలగాముఁడు పట్టువడెను. దొరకినదే తడవుగా త్రుటిలో వానిపై కుక్షిఁ ఖడ్గముతోఁ బొడిచెను. రాజును గోపము దీపింప నంకుశమ్మున గ్రుచ్చి బాలుని ప్రేవులు లాగెను. ఆ దెబ్బకు బాలుని రోష మతిశయించి విచ్చుకత్తితో రాజమస్తకము నఱికెను.

తోడనే దానిని తండ్రి యెదుటఁ బెట్టెను. నాయఁడది చూచి దుఃఖించుచు చేతిమీఁదుగఁ బెంచిన నలగామని కెట్టి హీనత గలుగఁ జేసితివి? పిలువని పేరంటము చెప్పని ఒక్క ప్రొద్దన్న పోల్కి సమరమునకు వచ్చి సేనల నన్నింటినిఁ జూఱ గొంటివి తుదకు రాజమస్తకమునే యిట్లు నాశన మొనర్చితివి.'' అని పుత్త్రుని నిందింప నాతఁడా కినుక బట్ట లేక తండ్రినిఁ దూలనాడి రణమున కేగెను. భూనాథుఁడు చచ్చెనన్న వార్త వినుటతోడనే నాయకురాలి కది గొడ్డలి పెట్టయ్యెను. దాన నాగసాని సేనలఁ బురికొల్పి అని కనిపెను. బాలుఁడు రోషావేశుఁడై రణమునఁ బ్రవేశించెనో లేదో కాని వెంటనే వీరస్వర్గ మలంకరించెను.

బాలుఁడు మృతినొందుట విని బ్రహ్మన్న మనసులో నల్పకాలము విచారపడి సైన్యముల వెంటనిడికొని కన్నమ దాసుతో గూడి కదనమున కేగెను. నాయని కిరుపోటిగ రాజ్య తంత్రము నడపిన సమగ్గురాలు నాయకురాలు మగబిరుదుగట్టి పోర నుంకించి అశ్వారూఢయై కదలెను. తన సైన్యమునకు తానే నాయకురాలయ్యెను. సేనలను నాల్గుభాగములుగఁ జేసి శత్రువుల నెదుర్కొన నిల్పెను. పెద్దన్నయు, పేర్నీఁడును కన్నమదాసును గలిసి నలువైపుల నాయకురాలి సేనల నలి నలి గావించిరిగాని, పేర్నీఁడును పెద్దనయు కన్నమనాయఁడు మొదలగు వీరులందఱు యుద్ధభూమికి బలియైరి. నాయకురాలు సంతసమున శత్రువుల మార్కొనుటకై నిలిచి యుండెను. తుదకు బ్రహ్మనాయని ప్రియశిష్యుఁడు కన్నమదాసు పోరాట

మున నామెను జయించి చేఁజిక్కించుకొనెను. వెంటనే నాయకు రాలి నాతఁడు త్రాళ్ళచే బంధించి బ్రహ్మనాయని కడకుఁ గొనివచ్చెను. నాయకురాలు బ్రహ్మన్నను జూచి సిగ్గుపడి యుండెను. పెదమల్లిదేవుఁడే శరణమయ్యెను. నాయఁడు దయార్ద్రహృదయుఁడై వీరనాయకులెల్లరు మరణించినందు లకు వైరాగ్యమును బొందెను. తత్ఫలితముగ నాయకురాలికి బంధవిముక్తిఁ గావించి పెదమల్లిదేవుని మూర్ధాభిషిక్తు నొన రించెను. చిరకీర్తినిఁ గాంచెను.

నాయకురాలి శైవమతమునకు బ్రహ్మనాయని వైష్ణవ మతమునకు భేదములేదని తెలియఁజేయుటకో యన వీరపురుషు లందఱు సమైక్యతఁ జెంది తపోవనమున కరిగిరి.

వీరచరిత్రలో నాయఁడు విష్ణ్వంశసంభూతుఁడని పేరు వడయుటగాక నేఁటికిని నాతని నామము సువర్ణాక్షరములతో వీర హృదయ ఫలకముల వీరమంత్రమై ఒప్పారెను. నేఁటికిని పల్నాటివీరులు సుప్రశస్త చరిత్రప్రసిద్ధులై కార్యమపూడిలో వీ రారాధనల నందుచున్నారు.

ముగింపు

క. వ్రాసితిమి నేర్పుకొలఁదిగ
దోసంబు లటుండనిండు దుస్సహ వీరా
గ్రేసర గాథల బాలురు
ధీసంయుతు లగుదురనుచుఁ దివిరితి మిటులన్.

జానకిరాం ప్రెస్, తెనాలి.